

# బొమ్మరిల్లు

సంపాదకుడు : విజయబాపినీడు

ఈ నెల కరాళకథ 'రాజనిర్ణయం' అనేది శ్రీ భీమవరపు పురుషోత్తం రచన. రాజ్యపురోభివృద్ధి కోసం రాజులు ఎంతగానో ఆలోచించి, తీసుకునే నిర్ణయాలు ఎలావుంటాయో ఇది చక్కగా తెలుపుతుంది.

ఈ నెల శ్రీ ఉత్పల రచన 'గిరిజా కళ్యాణం' ప్రారంభమయింది. ఇది మా పాఠకుల హృదయాల్ని కదిలించి వేసి, వారికి అత్యంత తృప్తిని కలుగిస్తూందని ఆశిస్తాం.

న్యాయపరిపాలన విరాజిల్లే చోట అటు రాజులు కాని, ఇటు వారిక్రింద పనిచేసే వారుకాని న్యాయాన్ని నిలబెట్టేందుకు ఎలా ప్రవర్తిస్తారో, వారి నిర్ణయాలు అందరికీ ఎలా సంతృప్తిని కలిగిస్తాయో తెలియజేస్తుంది.

సంపుటి : 19 సెప్టెంబరు 1989 సంచిక : 1

విడిప్రతి : రూ.3.00 సంవత్సర చందా : రూ.36.00







# బయటపడ్డ పిశాచం

రంగడు అల్లరి పిల్లాడు. తల్లి చెప్పిన మాట వినడు. తండ్రికి కనిపించడు. చదువుకోకుండా ఆట పాటల్లో కాలక్షేపం చేస్తూంటాడు. ఒక రోజున వాడి నాయనమ్మ పెరట్లో బట్టలారేసుకుంటూంటే వాటిమీద మట్టి విసిరాడు.

ఆమెకు కోపం వచ్చి, "వెధవ కానా , నీ అల్లరి నానాటికీ మితి మీరి పోతోంది. ఏ పిశాచమైనా వచ్చి నీకు బుద్ధి చెపితే బాగుండును," అంది.

ఈ మాటలు పెరట్లో వేప చెట్టు నంటి పెట్టుకుని ఉన్న పిశాచ మొకటి విన్నది. ఏదైనా మంచి పనిచేయాలని చాలాకాలంగా అది అనుకొంటుంది.

అయితే, పిశాచాలకు మంచి పనులు చేయటం నచ్చదు కదా! ఇప్పుడైతే ఆ కుర్రాణ్ణేడిపించనూ వచ్చు, నాయనమ్మను సంతోష పెట్టనూ వచ్చునని అనుకుంటూ పిశాచం రంగడి వయసు కుర్రాడిలా మారిపోయి వాడి ముందు ప్రత్యక్షమై, "ఒరేయ్ రంగా! చెడ్డ పనులు చేయకూడదు. మంచి పనులు చేయాలి," అంది.

రంగడు పిశాచాన్ని చూచి ఆశ్చర్యపోయి, "ఎవర్రా నువ్వు? మా యింట్లోకి ఎలా వచ్చావు?" అన్నాడు.

"నేను మంచి పనులు చేయటం వల్ల నాకెన్నో అద్భుత శక్తులు వచ్చాయి. అందుకే మీ నాయనమ్మ నిన్ను తిట్టగానే, నేనిక్కడ ప్రత్యక్షమైయ్యాను.

"నా మాటమీద నమ్మకం లేకపోతే ఇందాకా నువ్వు విసిరిన మట్టిని బట్టలమీంచి దులిపేయాలనుకో. ఏ బల్లా, పీటా అవసరం లేకుండానే నువ్వారేసిన బట్టలంత ఎత్తుకి గాల్లో లేవగలవు," అంది పిశాచం.

రంగడలా అనుకోగానే, వాడు గాల్లోకి లేచాడు. దాంతో రంగడికి కలిగిన ఉత్సాహమింతా అంతా కాదు. వాడు మొత్తం బట్టలన్నింటినీ మట్టి దులిపేశాక, దబ్బున నేల మీద పడ్డాడు.

పిశాచం పకపక నవ్వి, "నువ్వు మీ నాయనమ్మ

కష్టపడి ఆరేసిన బట్టల మీద మట్టి చల్లేవు కదా! అందుకే దబ్బున పడ్డావు. లేకుంటే నెమ్మదిగా నేలమీదకు దిగి ఉండే వాడివి అంది.



రంగడు పిశాచంవంక భయంగా చూచి, "అంతా చిత్రంగా ఉంది నాకు. నిన్ను నా స్నేహితులకు పరిచయం చేస్తాను. నాతో వస్తావా?" అని అడిగాడు.

పిశాచం సరేనన్నది. రంగడు దాన్ని తీసుకుని వెళ్ళి స్నేహితులకు పరిచయం చేశాడు. పిశాచం వాళ్ళముందు తన అద్భుత శక్తులు ప్రదర్శించి అందరినీ ఆశ్చర్య పరిచింది.

"ఇన్ని శక్తులున్నాయి. నువ్వు నిజంగా మనిషి వేనా?" అన్నాడో కుర్రాడు .

"అల్లరి మాని బుద్ధిగా చదువుకుంటూ పెద్దల మాట వింటే, మీ అందరికీ కూడా యిలాంటి అద్భుత శక్తులు వస్తాయి. ఇదేం పెద్ద విశేషం కాదు. ఇందాకా రంగడో మంచి పని చేద్దామనుకునేసరికి గాల్లోకి తేలగలిగాడు," అంది పిశాచం.

రంగడు నిజమేనని ఒప్పుకున్నాడు.

వెంటనే రంగడి స్నేహితుల్లో ఒకడు, "ఈ చెరువు కవతల వూరి గుడిలో ఓ ముసలమ్మ ఉంది. తిండి కోసం చుట్టు తిరిగి ఊళ్ళోకి రావాలి పాపం! నేను ఆ ముసలమ్మకు భోజనం తీసుకు వెళ్ళాలంటే నీళ్ళమీద నడిచి వెళ్ళ గలనా?" అన్నాడు.

"ఎందుకు వెళ్ళలేవు? కానీ ఆ ముసలమ్మకి వ్వటానికి నాదగ్గర తిను బండారాలు ఏమి లేవు కదా!" అంది పిశాచం.

"నీళ్ళమీద నడవాలంటే నాకు భయం కానీ ముసలమ్మ కోసం ఈ చెట్టెక్కి పళ్ళుకోసివ్వగలను. ఈ చెట్టు ఎవరి స్వంతమూ కాదు కాబట్టి వళ్ళె వరు కోసినా తప్పుకాదు," అన్నాడింకో కుర్రాడు.

"సరే, అయితే పళ్ళు కోయి," అంది పిశాచం.

అందరూ ఆశ్చర్యపడి చూస్తూండగా, ఆ కుర్రాడు గాల్లోకి లేచాడు. వాడుత్సాహింగా గాల్లో తేలుతూ, ఏ కొమ్మన పళ్ళుంటే అటువెటుతూ ఆరు పళ్ళు కోసి, ఏడవ పండు కోయబోతూండగా దబ్బున కింద పడ్డాడు.

"అంటే ముసలమ్మకు ఆరు పళ్ళు చాలన్న మాట! ఇతరులకు సహాయ పడ్డానికే తప్ప

స్వంతానికి అద్భుత శక్తులు పనికి రావు!" అంది పిశాచం.

రంగడు మధ్యలో కలగజేసుకుని, "పోని వీడు మనిషి కాదనే అనుకోండి. ఇన్ని మంచి పనులు చేసేవాడు దేవతాపురుషుడయుంటాడు. మనమంతా వీడికి నమస్కరించి పుణ్యం సంపాదించుకుందాం," అన్నాడు.

పిశాచం కంగారు పడి, "అలాగనకండి. నేనూ మామూలు మనిషినే! నాకూ అల్లరి చేయాలనే ఉంటుంది. మీకు తెలిసిన చెడ్డ వాళ్ళుంటే చెప్పండి. ఏడిపిద్దాం!" అంది.

"ఈ ఊళ్ళో వీరయ్య మహా పిసినారి. పిల్లికి కూడా బిచ్చం వేయడు. అప్పుడప్పుడు చందాలకని అయనింటికి వెడుతూంటాం!" అన్నాడు రంగడు.

పిశాచం రంగణ్ణీ వాడి స్నేహితుల్నీ వెంట బెట్టుకుని వీరయ్యింటికి వెళ్ళి తనే ముందుకు వెళ్ళి, "అయ్యా! పేద కుర్రాళ్ళ కోసం డబ్బు పోగు చేస్తున్నాం. తమరో పది వరహాలివ్వాలి," అంది.

వీరయ్య పిశాచానికి మాట్లాడకుండా పది వరహాలూ యిచ్చేశాడు.

దాంతో రంగడు కంగారు పడి, "బాబోయ్! నువ్వు దేవుతా పురుషుడివీ కాదు, మనిషివీ కాదు. పిశాచానివి!" అన్నాడు.

"అదేమిటి? ఇప్పుడేం జరిగిందని నీకీ అనుమాన మొచ్చింది!" అంది పిశాచం.

"వీరయ్య మరుమళ్లో మహాత్ములకు, సాధువులకు కూడా డబ్బివ్వడు. దేవుడి పేరు చెప్పినా డబ్బివ్వడు. సాక్షాత్తు ఆ దేవుడే దిగి వచ్చినా డబ్బివ్వడనీ ఆయన పిశాచాలకు తప్ప ఎవరికీ భయపడడనీ ఊళ్ళో అంతా చెప్పుకుంటారు," అంటూ రంగడు తన స్నేహితులతో సహా అక్కణ్ణించి పరుగు పుచ్చుకున్నాడు.

పిశాచం నిట్టూర్చి, "దేవుడి కన్నా లొంగని ఓ పిసినారి కారణంగా, నేను బయట పడిపోయానన్న మాట! మరో సారి ఇంకో ఉపాయం చూసుకోవాలి," అంటూ అక్కణ్ణించి మాయమయింది.





# సనక సనందులు

ఒకసారి సనక సనందనులనే మునులు శ్రీ మహా విష్ణువుణ్ణి దర్శించాలని వైకుంఠానికి వెళ్ళారు. కావలా భటులు వారికి స్వాగతం పలికి దారి విడిచారు.

రాచనగరు కావలి ·వాళ్ళు కూడా సగౌరవంగా వారిని లోపలకు పోనిచ్చారు. కానీ శ్రీ మహా విష్ణువు మందిరానికి కావలాగా ఉన్న జయ విజయులనే ద్వార పాలకులు మాత్రం వారిని లోపలకు వెళ్ళ నివ్వకుండా అడ్డు తగిలి నిలిచారు.

సనకనుడు వారితో,"నాయన లారా! మేము విష్ణువితో కొంత పని ఉండి వచ్చాం. మమల్ని లోపలకు పోనివ్వండి," అన్నాడు వినయంగా.

"వీలు కాదు. శ్రీ వారిప్పుడు విశ్రాంతి తీసు కుంటున్నారు," అన్నాడు జయుడు కచ్చి తంగా

సనందనుడు, "పోనీ, మీలో ఒకరు వెళ్ళి సనక సనందనులనే మునులు వచ్చి ద్వారం దగ్గర వేచి ఉన్నారని చెప్పండి," అన్నాడు అర్థిస్తున్నట్లుగా.

దీనికి విజయుడు పరిహాసపూర్వకంగా నవ్వి "అయ్యా! అడవుల్లో ముక్కు మూసుకుని తపస్సు చేసుకునే మీకు భృత్యుధర్మం, స్నేహ ధర్మం, విధి నిర్వహణ మొదలైన వాటి గురించి తెలిసినట్లు లేదు. మేమిక్కడ కావలా ఉన్నది ఇతరుల నెవ్వరినీ లోపలకు వెళ్ళకుండా ఆపడానికే తప్ప మీబోంట్ల వార్తలను మోసుకుని వెళ్ళి మా అయ్యా గారి సమయభంగం చేయటానికి కాదు. వివిధలోకాలకు చెందిన మహాత్ములు శ్రీ వారిని సందర్శించుకునేందుకు ప్రత్యేక వేళలున్నాయి. మీరూ ఇప్పటికి వెళ్ళి ఆ సమయానికి రండి," అన్నాడు.

సనకనుడు ఓరిమి కోల్పోకుండా, "బాబూ! మా నివాసం ఇక్కడికి చాలా దూరం. విష్ణు దర్శనార్థం వచ్చే వేళలు మాకు తెలియవు. ఇంకెప్పుడూ మా వల్ల ఇటువంటి పొరపాటు

జరుగదు. ఈ సారికి మాత్రం శ్రీ మహా విష్ణువుకు మా ఆగమన వార్త చెప్పిరండి. కలుసుకోవటం కుదరదని శ్రీ వారు సెలవిస్తే, తప్పకుండా వెనక్కు తిరిగి వెళ్ళిపోతాం," అన్నాడు.

అప్పుడు ద్వారపాలకులలో పెద్దవాడైన జయుడు సనకసమహర్షిని తీవ్రంగా చూస్తూ, "ఏమిటయ్యా మీ గోల? శ్రీ వారు చెపితే గానీ వెళ్ళనంటున్నారు, మరి మేమిక్కడెందుకున్నామని మీరనుకుంటున్నట్లు?" అన్నాడు.

"అయ్యా! మీరు సర్వలోక రక్షకుడైన శ్రీమన్నారాయణుల వారి మందిర ముఖద్వారం వద్ద రక్షణ భారం వహించిన పుణ్యాత్ములు. భగవంతుడి దర్శనార్థం వచ్చిన వారికి సహాయ పడాలి తప్ప, యిలా వితండవాదం చేయటం తగదు సుమా!" అన్నాడు నందనుడు సవినయంగా.

అందుకు జయుడు కళ్ళెర్ర జేసి, "ఏమిటీ? వితండ వాదం చేస్తున్నది మీరా, మేమా? అయినా మీరింతగా పట్టు బట్టి లోపలకు వెళ్ళాలనుకునేందుకు కారణం చెప్పండి. దాన్ని బట్టి ఏంచేయాలో మేము నిర్ణయిస్తాం," అన్నాడు.

"మాముని వాటికలకు రాక్షసుల బాధలు ఎక్కువయ్యాయి. మహా విష్ణువే మమ్మల్ని రక్షించాలి," అన్నాడు సనకసుడు.

ఈ మాటలు వింటూనే జయ విజయులు పక పక నవ్వారు.

నందనుడు శాంతం నన్న గిల్లుతున్న స్వరంతో, "మునుల బాధలకు నవ్వొచ్చే మీరు శ్రీ మహా విష్ణువు ద్వార పాలకులు కావటం సర్వలోకాలూ చేసుకున్న దురదృష్టం," అన్నాడు.



జయుడు వెంటనే, "నవ్వక చేసేదేముంద? ఇక్కడికెముని వచ్చినా, దేవలోక వాసి ఏతెంచినా ఇదే ఏడుపు? అందుకైనా ఓ వేళాపాళా ఉండదు. మీ లాంటి వాళ్ళతో విసిగి పోయే మా అయ్యాగారు, మా లాంటి వాళ్ళలను ద్వార పాలకులుగా నియమించుకున్నారు. ఇక వాగుడు కట్టి పెట్టి, మర్యాదగా వెంటనే వెనక్కు పోండి," అన్నాడు.

"వెళ్ళకపోతే ఏమవుతుంది?" అన్నాడు సనకనుడు.

"మాటలతో చెపితే మీ కెలా అర్థమవు తుంది?" అంటూ జయుడు విజయుణ్ణి హెచ్చి రించి తాను సనకనుడి మెడ పట్టుకున్నాడు. విజయుడు వెంటనే నందనుడి మెడ పట్టుకు న్నాడు

ఆవిధంగా జయవిజయులు సనసనంద నుల్ని మెడపట్టుకుని బలంగా దూరంగా త్రోసి వేశారు.

క్రిందపడిన మునులిద్దరి తలలకూ గాయాలై నెత్తుటి ధారలు చెంపలమీదుగా క్రిందికి జారాయి.

అప్పుడా మునులు దిగ్గున లేచి విస్ఫులింగా ల్లా మెరుస్తున్న కళ్ళతో జయవిజయులను తీవ్రంగా చూస్తూ, "ఓరీ, దురహంకారులారా! విష్ణు సాన్నిధ్యంలో ఉన్నందుకు విర్రవీగుతూ విష్ణు భక్తులనే అవమానించే మిమ్మల్ని క్షమించి విడిచి పెట్టకూడదు. మానవత్వం ఎన్నోసార్లు దైవత్వానికి గుణపాఠం నేర్పి ఉంది. ఇప్పుడూ మా కారణంగా అదే జరుగబోతుంది. మహర్షు లను పొగరుబోతు తనంతో దూషించే మీరో



రాక్షసత్వం కరడుగట్టింది. కాబట్టి మీరు విష్ణు సాన్నిధ్యం వలన లభించిన పుణ్యఫలాన్ని కోల్పోయి రాక్షసులై పోవుదురు గాక," అన్నాడు.

అంతే! తపో ప్రభావ సంపన్నులైన ఆ మునుల శాపం ఫలించి జయ విజయులు లిద్దరూ వెంటనే రాక్షసులై పోయారు. దాంతో వాళ్ళకు జ్ఞానోదయం కాగా, మునుల పాదాల బడి విష్ణుసాన్నిధ్యానికి తమ్ము దూరం చేయ వద్దని పరి పరి విధాల ప్రార్థించారు.

మహాత్ముల కోపం క్షణికమైనది. వారు జయవి జయులను జాలిగా చూస్తూ, "ఈ బుద్ధి మీకు ముందుగా వచ్చి ఉండాల్సింది. పశ్చాత్తాపంతో ఎన్ని పాపాలనైనా కడిగేయ వచ్చును కాని, అమోఘమైన మా శాపం నుండి తప్పించుకోవ టం సాధ్యంకాదు. అయితే మీమీద జాలితో మీకో అవకాశమిస్తున్నాం. వెయ్యి జన్మలు విష్ణు భక్తులుగా దూరాన ఉండి, ఆ తర్వాత విష్ణు సేవకు వస్తారా లేక, మూడు జన్మల పాటు హరికి బద్ధవైరులై, ఆ తర్వాత విష్ణుసేవకడు తిరిగి వస్తారా, కోరుకోండి!" అన్నారు.

జయవిజయులు వెంటనే వినయంగా రెండు చేతులూ కట్టుకుని, "అయ్యలారా! దీనికి వేరే ఆలోచన అవసరం లేదు. ఎంత త్వరగా మాస్వా మిని చేరుకుంటే అంత మంచిది. ముందుగా మూడు జన్మల అనంతరం విష్ణు సాన్నిధ్యా నికి తిరిగి వచ్చేలా అనుగ్రహించండి," అని అడిగారు.

సనకసనందనులు సరేనన్నారు.

ఆ విధంగా జయ విజయులు హిరణ్యాక్ష హిరణ్య కశిపులుగానూ, రావణ కుంభకర్ణులు గానూ, శిశుపాల దంతవక్త్రులుగానూ మూడు జన్మలెత్తి శ్రీ హరితో బద్ధవైరం కొనసాగించి, శ్రీ హరి చేతుల్లోనే సంహరింపబడి చివరకు మళ్ళీ వైకుంఠం చేరుకున్నారు.





# గిరిజా కళ్యాణం

శివుడి అర్థాంగి సతీదేవి. దక్షయజ్ఞంలో జరిగిన అవమానానికి దగ్ధమయింది. ఆనాటి నుంచి శివుడు విరాగి అయినాడు. ఎవరేది ఇచ్చినప్పటికీ పుచ్చుకొనని అపరిగ్రహం అనే వ్రతం ఆచరింపసాగాడు. దక్షపురం వదలి, నంది వాహన మెక్కి హిమాలయానికి బయలుదేరాడు. ప్రమథ గణాలు కూడా ఆయన వెంట కదలి వెళ్ళాయి.

హిమాలయానికి అధిష్ఠానదైవం హిమవంతుడు. అతడు శివుడి రాక తెలుసుకొన్నాడు. తన పరిసరాలకు అతిథిగా విచ్చేసిన శివుడికి, ఆయన పరివారానికి ఘనంగా స్వాగత మివ్వదలచాడు. తన భార్య మేనకా దేవితోనూ, కూతురు గిరిజతోనూ పూజా సామాగ్రిని తీసుకొని బయలుదేరాడు. గిరిజనే పార్వతి అంటారు.

తపోనిష్ఠలో కూర్చున్న శివుణ్ణి పూజించి, సత్కరించాలనుకొని హిమవంతుడు ప్రక్కనే ఉన్న నందీశ్వరుడి అనుజ్ఞ వేడు కొన్నాడు.

నందీశ్వరుడు అనుజ్ఞ ఇచ్చాడు. భార్యా పుత్రికలతో పాటు కూర్చుండి హిమవంతుడు శివుడికి యథా విధిగా పూజలు చేశాడు. ప్రమథగణాలను యథోచితంగా సత్కరించాడు. హిమవంతుడి భక్తికి శివుడు ప్రసన్నుడైనాడు.

"దేవా! నీవు విరాగివి. నా వద్ద అమూల్యమైన రత్నాలు అనంతంగా ఉన్నాయి. కాని, వాటిని నీవు ఆశించవు. ఇక్కడ నీ తపస్సు నిర్విఘ్నంగా కొనసాగదీయటానికి, నీకు సేవలు చేయటానికి నా పుత్రికా రత్నాన్ని నీకు సమర్పిస్తున్నాను. దయతో ఈమె సేవా సపర్యలను అంగీకరించండి," అని చేతులు మోడ్చి ప్రార్థించాడు హిమవంతుడు.

బ్రహ్మచర్య దీక్షతో తపస్సు చేస్తున్న పురుషుల వద్దనున్న స్త్రీలు సామాన్యంగా విఘ్నకారిణులు అవుతారు.

శివుడు మహావైరాగ్యవంతుడు కాబట్టి, గిరిజా కుమారి పరిచర్యలను అంగీకరించాడు.

కిఁఉత్పల



గిరిజ తన చెలికత్తెలతోపాటు శివుడి తపోవనం లోనే ఉండి పరిచర్యలు చేయసాగింది.

పువ్వులు, దర్భలు కోయటం, వాటిని భద్రప రచటం అర్ఘ్యపాద్యాలకు కావలసిన గంగాజలాలను బిందెలతో తీసుకురావటం, యజ్ఞవేదికలను శుభ్రపరచటం, అలికి ముగ్గులు పెట్టటం గంధా క్షతలు కలపటం, ధూపం వేయటం, దీపం వెలిగించటం మొదలయినవి గిరిజాకుమారి నిత్యకృత్యాలయినాయి.

శివుడు ఏళ్ళలంగా ధ్యానంలో మునిగిపోయి ఉండేవాడు. దగ్గర కూర్చొని గిరిజ ఆ ప్రదేశాన్ని స్వయంగా అలికి శుభ్రంచేస్తూండేది. ఆ సమయంలో ఆమె అలసి పోయేది. శివుడిశిరస్సున పూగుత్తివలె నున్న చంద్రరేఖ చల్లదనం ఆమె అలసటను పోగొట్టుతుండేది.

శివుడి పరిచర్యలో గిరిజాకుమారికి ఎంతో సౌఖ్యమే కాకుండా, క్రమక్రమంగా భక్తి కూడా పెంపొందింది. పరిచర్యల పట్ల ఆసక్తి పెరిగింది. శివుడి తపస్సు నిర్విఘ్నంగా కొనసాగింది.

స్వర్గలోకంలో దేవేంద్రుడు ఒకనాడు ఏదో దీర్ఘంగా ఆలోచిస్తూ నందనోద్యానవనంలోనికి వెళ్ళాడు. కల్పవృక్షాల నీడనగల చింతామణి వేదిక మీద ఆసీనుడైనాడు. దిక్పాలకులు, దేవ ముఖ్యులందరూ వచ్చి, ఆయన చుట్టూ చేరారు. దేవకార్యాన్ని గురించి తనవాళ్ళతో సుదీర్ఘంగా చర్చింపసాగాడు దేవేంద్రుడు.

చాలాసేపు చర్చచేసి దేవేంద్రుడు దేవకార్యం నెరవేర్చటానికి లక్ష్మీపుత్రుడైన మన్మథుడవసర మనుకొన్నాడు. అతణ్ణి మనసులోనే స్మరించాడు.

వెంటనే లక్ష్మీపుత్రుడైన మన్మథుడు చెరకువిల్లు పూలబాణాలతో, చిగురాకుల గొడుగుతో ప్రత్యక్ష మయ్యాడు. అతడి వెంట వసంతుడున్నాడు.

రాచిలుక రథం దిగి నేరుగా దేవేంద్రుడి దగ్గరకు వచ్చాడు మన్మథుడు.

దేవేంద్రుడు అతడి సౌందర్యాన్ని కన్నార్ప కుండా చూచాడు. అతడి అందచందాలు చూడ టానికి వేయికళ్ళు చాలవనుకొన్నాడు. దేవత లందరు రెప్పవాల్చకుండా మన్మథుడి వంకకే చూడసాగారు. అతడి ముఖంలో లక్ష్మీకళ ఉట్టి పడుతున్నది. శరీరం చంద్రకాంతివలె మెరుస్తు న్నది.

దేవేంద్రుడు వెంటనే లేచి చేయి అందించి, "ఇటు రా," అంటూ మన్మథుణ్ణి ప్రియమార తన దగ్గర కూర్చుండబెట్టుకొన్నాడు.

దేవేంద్రుడి ఆప్యాయతకు ముగ్ధుడై మన్మథుడు చేతులు మోడ్చి నమస్కరించి, "దేవపతీ! తాము నన్ను స్మరించిన కారణమేమిటో సెలవివ్వండి," అని అడిగాడు.

అతడి వినయం కూడా ఎంతో అందంగా ఉంది. చెప్పటానికి దేవేంద్రుడు సందేహించాడు.

"దేవేంద్రా! నీ పదవిని పొందటానికి ఎవడైనా ఘోరమైన తపస్సు చేస్తున్నాడా? చెప్పు. వాడి తపస్సు నిప్పుడే భంగపరిచి ఇంటికి పంపిస్తాను. నీ వజ్రాయుధాన్ని తామరపువ్వంత తేలికగా ఎవడైనా భావిస్తున్నాడా? చెప్పు. వాణ్ణి తీసుకు వచ్చి నీ పాదాలముందు పడద్రోస్తాను. నీవు వరించిన కన్య ఎవతైనా నిన్ను తిరస్కరించిందా? చెప్పు. దాన్ని ఇప్పుడే రప్పించి స్వయంగా నిన్ను కౌగిలించుకొనేట్లు చేస్తాను. నీవు మనసిచ్చిన సుందరి నిన్ను మన్నించలేదా? చెప్పు, తక్షణమే ఆ సుందరిని విరహాగ్నిలో వేగిపోయేట్లు చేస్తాను. నీ వజ్రాయుధానికి భద్రమగుగాక! అది ఇక విశ్రాంతిని పొందుగాక! నేనీ చెరకు వింటితో పూలబాణాలతో నీ శత్రువును నిర్జిస్తాను. నాకీ వసంతుడూ, మలయానిలుడూ, మా మామ చల్లని దయా ఉంటే చాలు పినాకపాణి అయిన శివుణ్ణి కూడా జయిస్తాను. తక్కిన వాళ్ళ సంగతి చెప్పనక్కర లేదు," అన్నాడు మన్మథుడు దర్పంగా.

ఆ మాటలు విని, దేవేంద్రుడు తన ప్రయత్నం నెరవేరుతుందని సంతోషించి ఇలా అన్నాడు:





"లక్ష్మీకుమారా! లోకంలో నీకు అసాధ్యమైనది ఏదీ ఉండదు. భూభారాన్ని మోయటానికి నీ తండ్రి శ్రీహరి ఆదిశేషుణ్ణి నియమించినట్లుగా ఇప్పుడు నిన్నొక మహాకార్యానికి నియోగింపదలచాము. దేవకార్యం నిమిత్తం నీవు శివుడిదగ్గరికి వెళ్ళవలసియున్నది. గిరిరాజ పుత్రిక అయిన గిరిజను శివుడు చేపట్టేటట్లుగా నీవు చేయాలి. వారిద్దరికి జన్మించినవాడు దేవసేనా నాయకుడై, తారకాసురుణ్ణి వధించి దేవతలకు విజయం చేకూరుస్తాడని బ్రహ్మదేవుడు ఆనతిచ్చాడు.

"ఇప్పుడు శివుడు హిమాలయాల దగ్గరనే ఉన్నాడు. అక్కడి దేవదారువనంలో తపోమగ్నుడయ్యాడు. అందాలబరిణ గిరిజ. శివుడికి పరిచర్యలు చేస్తూ ఆయనకు చాలా దగ్గరగానే ఉంది. ఇది మంచిసమయం. ప్రమథులు కూడా శివుడి మాదిరిగానే తపస్సుకు పూనుకొన్నారు. ఇక అక్కడ నందీశ్వరుడొక్కడే నిరంతరం శివుణ్ణి కనిపెట్టుకొని ఉంటాడు.

"ఆ గిరిజ గిరిరాజపుత్రిక అయినా మెత్తని గుండె కలది. ఎంతో అందగత్తె. సుకుమారవతి. శివుడివట్ల భక్తి మాత్రమే కాదు, మహానురాగం కలది. ఆయన సేవలో తన్మయం చెందుతున్నది. వారిద్దరినీ భార్యాభర్తలను చేయటమే నీవు చేయవలసిన పని. ఇది నీ వలన తప్ప, ఇతరుల వలన అయ్యేపని కాదు. ఇది ముల్లోకాలకూ హితమైన కార్యం. ఈ పనిలో రవ్వంతయినా హింస లేదు.

"అయితే, ఆ శివుడు అపరిగ్రహి అయిన వైరాగ్యవంతుడనీ, ఆయనకు ఉగ్రుడనే మరొక పేరు ఉన్నదనీ గుర్తుంచుకొని నువ్వు జాగ్రత్తగా మెలగ వలసి ఉంటుంది."

"అది సరే కాని, దేవేంద్రా! ఆ తారకా సురుడి మీదికే నన్ను పంపరాదా? చిటికెలో వాణ్ణి సంహరించి వస్తాను. శివపార్వతులకు వివాహం జరిగి, వారికి పుట్టిపెరిగినవాడు ఆ తారకాసురుణ్ణి సంహరించాలంటే చాలాకాలం పడుతుంది గదా!" అన్నాడు మన్మథుడు.

"మన్మథా! నీ కంతటి సామర్థ్యం ఉంది. కాని, బ్రహ్మదేవుడు మాకిలా ఆనతిచ్చాడు. శివపార్వతులకు జన్మించిన కుమారుడే తారకాసుర సంహారి అవుతాడని ఆయన చెప్పాడు. బ్రహ్మ

దేవుడి అనతిని పాటించటం మా విధి," అని చెప్పాడు దేవేంద్రుడు.

"సరే మీ ఇష్టప్రకారం చేస్తాను. ఆ శంకరుణ్ణి కామకింకరుణ్ణి చేస్తాను. గిరిజపట్ల వ్యామోహం కలిగిస్తాను," అంటూ లేచాడు మన్మథుడు.

"ఉండు. ఉండు. దేవకార్యం నిమిత్తం నువ్వు తాంబూలం తీసుకుపోదువుగాని," అని దేవేంద్రుడు మన్మథుడిని కూర్చుండబెట్టి కర్పూర తాంబూలమిచ్చి, భుజం తట్టి పంపించాడు.

ఇక్కడ శృంగారవనంలో రతిదేవి తన భర్త మన్మథుడి రాకకు ఎదురుచూడసాగింది. ఆమె మనస్సెందుకో తల్లడిల్లింది. అపశకునాలు ఏవో తోచాయి.

ఇంతలో ఆకాశవీధిలో మన్మథుడి మకర కేతనం మిలమిల మెరిసింది.

శృంగారవనంలో కోకిలలు ఒక్కసారిగా గానం చేశాయి. తుమ్మెదలు ఝుమ్మని మెరిసాయి. మన్మథుడు వచ్చి రతిదేవిముందు నిలిచాడు.

రతిదేవి తన భర్త గుండెలమీద చేయి వేసి మెల్లగా నిమిరి, "దేవేంద్రుడు ఇంత హఠాత్తుగా మిమ్మల్ని ఎందుకు రమ్మన్నాడు?" అని మరిమరీ అడిగింది.

మన్మథుడు రతిదేవి ముఖకవళికలను పరిశీలిస్తూ, చిరునవ్వు చిందిస్తూ, "నీ వెందుకు ఇంతగా కలవరపడుతున్నావో ముందు నాకు చెప్పు," అని బుజ్జగించి అడిగాడు.

"ఏ వేవో అపశకునాలు తోచాయి నాకు కుడికన్నూ, కుడిభుజమూ అదిరింది. ఏదో కీడును శంకించాను. సరేగాని, ఇక చెప్పండి. మీరు వెళ్ళిన పని ఏమిటి?" అంది రతిదేవి.

"పెద్ద విశేష మేమి లేదు. శివుడి తపస్సు భంగపరచమని దేవేంద్రుడు అడిగాడు నన్ను. అందుకు నేను అంగీకరించి వచ్చాను," అన్నాడు మన్మథుడు.

ఆ మాట విని రతిదేవి అదిరిపడింది.

— (ఇంకా ఉంది)





# అపకారంలో ఉపకారం

ఒకానొక పల్లెటూళ్ళో ఒకరైతు ఉండేవాడు. అతడికి భార్యాబిడ్డలులేరు. ఉన్న పొలం పండించుకుని ఆ ఆదాయంతో రోజులు వెళ్ళబుచ్చు తున్నాడు. కాని, ఆప్రాంతంలో రెండేళ్ళపాటు వరుసగా కరువొచ్చింది. బావులు, చెరువులు అన్నీ ఇంకిపోయాయి. పొలం సంగతి అటుంచి త్రాగటానికే నీరుకరువయ్యింధి.

రైతుకు ఊరొదిలి పెట్టక తప్పలేదు. పట్నం పోయి ఏకూలి పనో చేసుకుని బ్రతకాలనుకున్నాడు. చేతిలోడబ్బులేక కాలినడకన ప్రయాణమయ్యాడు.

అలాచాలాదూరం నడిచి మిట్టమధ్యాహ్నం వేళకు అలసటతో ఆగాడు. అక్కడో పెద్ద బండ రాయి ఉంది. దానినీడలో నిలబడి చుట్టు చూశాడు రైతు. అతడిని ఆకలి, దాహం బాధిస్తున్నాయి. ఎక్కడా చుక్క నీరు కనిపించటం లేదు.

దిగులుగా, "భగవంతుడా! నేనేం పాపం చేసానని నాకీ శిక్షవిధించావు?" అనుకుంటూ మనసులోనే దేవుణ్ణి దూషించసాగాడు రైతు.

ఆసమయంలో బండరాయిపైనుంచీ నీటి చుక్కలు రాలసాగాయి. రైతు తనభుజానికి తగిలించి ఉన్న సంచీలోంచి గిన్నె ఒకటితీసి ఆ నీటిచుక్కల క్రిందపెట్టాడు. గిన్నెసగం నిండేసరికి నీటి చుక్కలు రావటం ఆగిపోయాయి. రైతునీటిని తాగాలనుకుంటూంటే, ఎక్కణ్ణించో ఓ కాకి ఎగురుకుంటూవచ్చి ఆగిన్నెను తన్నేసింది. నీళ్ళన్నీ ఒలికిపోయాయి.

అప్పుడు రైతుక్కలిగిన కోపమింతా అంతాకాదు తన భుజానికి తగిలించిన సంచీ కిందపెట్టి, కిందనుంచి ఓరాయిని తీసుకుని ఆకాకివెంట పడ్డాడు. కాకిదూరంగా ఎగురుతూంటే, చివరికి సంచీని బలంగా కాకిమీదకు విసిరాడు రైతు. అది కొంచెంలో కాకిని తప్పించుకుంది.

"దొమల్ని శిక్షించే మార్గంలేదు. ఈ ప్రపంచంలో శిక్షలన్నీ నావంటి అమాయకులకే!" అనుకుంటూ రైతు దేవుణ్ణి దూషించి చుట్టూ చూసేసరికి, ఎదురుగా మంచినీటి కొలను

వై.స.పి.వెంకటరెడ్డి

కనిపించింది.

మారొలోచన లేకుండా రైతు కొలనులో ప్రవేశించి కాళ్ళు, చేతులు, ముఖం కడుక్కుని దప్పిక తీర్చుకున్నాడు. అప్పటికతడికి ప్రాణం తెరిపిన పడింది.

రైతు వచ్చిన దారినే వెనక్కువెళ్ళి బండరాయిని చేరుకున్నాడు. మళ్ళీ రాయి పైనుంచీ నీటి చుక్కలు పడుతున్నాయి. బండరాయి నుంచీ నీటిచుక్కలు పడడం విచిత్రమని అప్పటికి లేచి అతడు పక్కనుంచీ పైకెక్కి బండరాయిమీదకు చేరుకున్నాడు. అక్కడచూసిన దృశ్యం అతణ్ణి ఆశ్చర్యచకితుణ్ణీ, భయవిభ్రాంతుణ్ణీ చేసింది.

బండరాతి చివర్లో సన్నటినీటి ఊట ఉంది. ఒకపాము ఆనీటి ఊటలో తలనుంచి ఆడుకుంటోంది. అప్పుడప్పుడు దానినోట్లోంచి విషపు చుక్కలు పడ్డినీటి ఊటలో కలుస్తున్నాయి. మధ్య మధ్య పాము నీటిని తాగుతోంది. అప్పుడు నీటిచుక్కలు క్రింది పడడం లేదు. లేకుంటే ఒకటోకటిగా చుక్కలు క్రింద పడుతున్నాయి.

అంటే ఆబండరాతినీటి ఊట పాములకోసం ఉపయోగపడుతోంది. విషపూరితమైన ఆనీటిని తను తాగబోతే కాకి తన్ను రక్షించింది.

తనవంటి అమాయకుల్ని ఏదోరూపంలో భగవంతుడు రక్షిస్తూనే ఉంటాడు. కాకికారణంగా తాను విషం త్రాగకపోవటమే కాదు, మంచినీటి కొలను ఎక్కడుందో కూడా తెలుసుకున్నాడు.

అమాయకుడైన తనను భగవంతుడేదో విధంగా రక్షిస్తూంటే తనేమో అమాయకమైన కాకిని చంపాలనుకున్నాడు. రాయిగురితప్పి ఉండకపోతే తనకు ఉపకారంచేసిన తప్పుకు కాకి మరణించి ఉండాల్సిందే! తన్ను రక్షించిన భగవంతుడే తనగురితప్పేలాచేసి కాకినీ రక్షించాడు.

రైతుకు దేవుడంటే నమ్మకం కుదిరి సుఖంగా రోజులు వెళ్ళబుచ్చాడు. అయితే అపకారంలో కూడా ఉపకారముండొచ్చునని అనుభవపూర్వకంగా తెలియటం వల్ల, ఆరోజు నుంచీ అతడెన్నడూ ఎవరిమీద ద్వేషంపెంచుకొని మోసగించాలనుకోలేదు.



# ఒకే జబ్బుకి రెండు వైద్యాలు

బిల్హణుడనే వైద్యుడి వద్ద ప్రకండుడనే వాడు శిష్యుడిగా ఉండేవాడు. వాడు గురువు చెప్పిన పాఠాలు వినటమే కాక, ఆయన వైద్యం చేసే పద్ధతిని కూడా శ్రద్ధగా గమనిస్తూండేవాడు.

ఒక రోజున రంగయ్య, చెంగయ్య అనే ఇద్దరు రోగులు వస్తే బిల్హణుడు ప్రకండుణ్ణి పిలిచి, "వీళ్ళిద్దర్నీ పరీక్షించి రోగ లక్షణాలు తెలుసుకుని వీళ్ళతో ఏమీ మాట్లాడకుండా అన్నీ నాకు రహస్యంగా చెప్పు," అన్నాడు.

ప్రకండుడలాగే చేసి వారిద్దరికీ ఒకే రకంరోగలక్షణాలున్నట్లు చెప్పాడు.

అప్పుడు బిల్హణుడు రంగయ్యను పిలిచి; "నీకు వచ్చింది సామాన్య రోగం కాదు. అదృష్ట వశాత్తూ సమయానికి నావద్ద సరైన శక్తివంతమైన ఔషధమున్నది. ఇది సేవించావంటే మరు జన్మలో కూడా నీకీ వ్యాధి సోకదు," అంటూ ఓ ఔషధాన్నిచ్చి దాని ఎలా సేవించాలో చెప్పాడు.

రంగయ్య ఔషధాన్ని తీసుకుని బిల్హణుడికి నమస్కరించి సంతోషంగా అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

తర్వాత బిల్హణుడు చెంగయ్య వంక చూసి, "చెంగయ్యా! నువ్వు చాలా అదృష్టవంతుడివి. నీకు వచ్చినది చాలా సామాన్యమైన రోగం; దానికి నేనిచ్చే ఈ మందు ఎంతో బాగా పనిచేస్తుంది. క్రమం తప్పకుండా సేవించు;" అన్నాడు.

చెంగయ్య కూడా బిల్హణుడికి నమస్కరించి ఆయనిచ్చిన ఔషధం తీసుకుని సంతోషంగా అక్కణ్ణించి వెళ్ళి పోయాడు.

రోగులిద్దరూ వెళ్ళిపోయాక, "ఒకే రోగలక్షణాలతో రెండు రకాల రోగాలుంటే, ఆ తేడా ఎలా తెలుస్తుంది గురువు గారూ? ఈ రహస్యం తెలుసుకోవాలని నాకు చాలా కుతూహలంగా ఉంది," అన్నాడు.

బిల్హణుడు "వాళ్ళిద్దరి రోగాలూ వేర్వేరని నీవెందుకనుకుంటున్నావు? ఇద్దరిదీ ఒకటే జబ్బు!" అన్నాడు.

రోగాలు రెండూ ఒక్కటే అయితే వీరిద్దరికీ వేర్వేరు ఔషధాలెందుకిచ్చారు? రెండు విధాలుగా ఎందుకు చెప్పారు?" అన్నాడు చెంగయ్య.

"నేను ఇద్దరికీ ఒకే ఔషధాన్నిచ్చాను. వేర్వేరు విధాలుగా ఎందుకు చెప్పానంటే, వైద్యుడు మనిషి తత్వాన్ని బట్టి మాట్లాడాలి. రంగయ్య, చెంగయ్య నాకు బాగా తెలుసు. చిన్న పామునైనా పెద్ద కర్రతో కొట్టాలనే తత్వం రంగయ్యది. అతడి కొచ్చిన రోగం మామూలు దన్నా మందు సాధారణమైనదన్నా అనుమానంతో బెంగ పెట్టుకుంటాడు. దాంతో అతడి జబ్బు ఓ పట్టాన తగ్గదు. ఇక చెంగయ్య స్వతహాగా భయస్థుడు. శక్తివంతమైన మందిస్తున్నానంటే తన రోగాన్ని పెద్దదిగా ఊహించుకుని మానసికంగా కృంగిపోతాడు. అందుకే ఇద్దరికీ వేర్వేరు విధాలుగా చెప్పాను," అన్నాడు బిల్హణుడు.

అప్పుడు ప్రకండుడికి వైద్యంలో మనుషుల తత్వాలకు గల ప్రాముఖ్యత అర్థమై గురువుగారి తెలివికి మనసులోనే జోహారులర్పించాడు.

—వక్కలంక కిషోర్



# రాజ నిర్ణయం

ఒకానొకప్పుడు అవంతీ దేశాన్ని విష్ణు దత్తుడనే రాజు పరిపాలిస్తూండేవాడు. ఆయన సైన్యాధిపతి హఠాత్తుగా మరణిస్తే ఆ పదవికి సమర్థుడి నెన్నిక చేయటం కోసం రాజ్యంలోని వీరులందరికీ ఖడ్గ విద్యలో పోటీలేర్పాటు చేశాడు. అందులో గణపతి దేవుడు, విద్యారణ్యుడు అనే వాళ్ళు సమ ఉజ్జీలుగా వచ్చారు. విష్ణుదత్తుడు వారిద్దరికి మధ్య పోటీ పెట్టాడు. నిండు సభలో చాలా సేపు ఇద్దరికీ తీవ్రపోరాటం జరిగింది.

చివరికి గణపతి దేవుడు విద్యారణ్యుడి చేతిలోని కత్తిని ఎగురగొట్టి తన కత్తిని విద్యారణ్యుడి గుండెలకానించి, "గెలువు నాదే!" అని మందహాసం చేశాడు.

## కరాళ కథలు



విష్ణుదత్తుడు సింహాసనం దిగి వచ్చి గణవతి దేవుడు ఖడ్గ విద్యా ప్రావీణ్యాన్ని మెచ్చుకుని, "ఖడ్గ విద్యలో నీకు నీవేసాటి. నీవు కొలువులో చేరి ఒకరికి తలవంచవలసిన వాడివి కాదు. నేను తగిన ధన సహాయం చేస్తాను. నీవు ఖడ్గ విద్యాలయాన్ని నెలకొల్పి మన రాజ్యంలో ఔత్సాహికులకు ఖడ్గ విద్యలో శిక్షణ యిస్తూ వుండు. విద్యారణ్యుణ్ణి సైన్యాధిపతిగా నియమిస్తాను," అన్నాడు.

అది రాజు తీసుకున్న నిర్ణయం కావటం వల్ల ప్రజలు హర్షధ్వానాలు చేస్తూ చప్పట్లు కొట్టారు. అయితే సైన్యాధిపతి ఎన్నికలో విష్ణుదత్తుడు పక్షపాత బుద్ధిని చూపి గణవతిదేవుడి కన్యాయం చేశాడన్న వదంతి ప్రజల్లో వ్యాపించింది. విద్యారణ్యుడు రాజుకు రాణి తరవు బంధువు కావటం కూడా అందుకో కారణం.

పాతిక సంవత్సరాలు గడిచాయి.

గణవతి దేవుడి ఖడ్గ విద్యాలయం రాజ్యమంతటా పేరు గాంచింది. అక్కడ శిక్షణ పొందిన వారికే సాధారణంగా రాజు కొలువులో ఖాళీ వచ్చినప్పుడల్లా అవకాశం వస్తూండేది. రాజ్యంలో ఖడ్గ విద్యాలయాలు చాలా ఉన్నప్పటికీ గణవతి దేవుడి విద్యాలయానికి తర్వాతే ప్రజలు మిగతా వాటిని చెప్పుకునే వారు.

ఇప్పుడు విష్ణుదత్తుడు జీవించి లేడు. ఆయన కుమారుడు విశాఖదత్తు డావంతి ఏలుతున్నాడు. విచిత్రమేమిటంటే తండ్రికి వచ్చిన లాంటిదే అతడికీ సమస్య వచ్చి పడింది.

రాజు కొలువులో ఉపసైని కాధికారికి ఏదో తెలియని జబ్బు చేసి అకస్మాత్తుగా మరణిం



చాడు. ఆ పదవిని భర్తీ చేయటానికి గణపతి దేవుడి ఖడ్గ విద్యాలయానికి కబురు పంపాడు విశాఖ దత్తుడు. అంత పెద్ద పదవిని భర్తీ చేయడానికి తన శిష్యులే తగిన వారుగా రాజు భావించటం గణపతిదేవుడికి సంతోషాన్నిచ్చింది.

మర్నాడే గణపతి దేవుడు శిష్యులందర్నీ సమావేశ పరిచి విశాఖదత్తుడి కబురు చెప్పి, "ప్రియ శిష్యులారా! మీరందరూ నాకు సమానులే! పదవికోసం కాక మీ ప్రతిభా సామర్థ్యాలను ప్రదర్శించటానికి శక్తి వంచన లేకుండా కృషి చేయండి," అన్నాడు.

అప్పుడు శిష్యుల్లో నుంచి ఒకడు ముందుకు వచ్చి, "గురువర్యా! తమసాహచర్యం కారణంగా మాలో కొంత సంస్కారం ఏర్పడింది. మా శక్తి సామర్థ్యాలను అంచనా వేయటానికి మా మధ్య జరుపనవసరం లేదు. మాలో అన్నింటా స ఉజ్జీలు అనంతుడు, సారంగుడు. ఎంత ప్రం త్నించినా ఖడ్గ విద్యలో మేము వారి స్థాయి చేరుకోలేక పోతున్నాము. ఉప సైన్యాధి పదవికి వారిలో ఒకణ్ణి ఎన్నిక చేస్తే సరి తుంది," అన్నారు.

అనంతుడు గణపతి దేవుడి కుమారు సారంగుడు విద్యా రణ్యుడి కుమారుడు. మిగ శిష్యులు ఖడ్గ విద్యలో వారి కాలిగోటికి పోలర విషయం గణపతిదేవుడికి తెలుసు. అయిన టికీ ఆయన శిష్యులందరికీ సమానావకాశమి లను కున్నాడు. కాని, శిష్యులు పోటీ అవస లేకుండా చేశారు.

గణపతిదేవుడు అనంతణ్ణీ, సారంగుణ్ణీ వెం బెట్టుకుని విశాఖదత్తుడి వద్దకు వెళ్ళి జరిగి





చెప్పాడు.

రాజు అంతావిని, "అయితే అనంతుడికీ, సారంగుడికీ మధ్య పోటీ పెట్టండి. మీరూ, విద్యారణ్యుడూ ఖడ్గ యుద్ధ న్యాయనిర్ణేతలు. మీరిద్దరూ ఏక గ్రీవంగా ఎవరినెన్నిక చేస్తే వారే ఉపసైన్యాధిపతి," అన్నాడు.

అంతా విశాఖదత్తుడు కోరినట్లే జరిగింది.

అనంతుడు, సారంగుడు ఖడ్గపాణులై ఒకరి కొకరు ఎదురు నిలిచారు. ఇద్దరి మధ్య పోరాటం ప్రారంభమయింది. కొంత సేపయ్యేసరికి సారంగుడిలో అదోరకమైన ఆవేశం ఏర్పడి ఉన్నట్లుండి అతడు విజృంభించేసరికి అనంతుడు కొద్దిగా వెనుకంజ వేసినట్లు కనిపించాడు. పోటీ మరికాసేపు జరిగితే అనంతుడు ఓడిపోవటం తథ్యమనిపించింది.

అలాంటి సమయంలో గణపతిదేవుడు పోటీని ఆపి, "ప్రభూ! పోటీలోసారంగుడిదే పైచేయి అయింది. పోటీ పూర్తిగా జరిగితే విజయం సారంగుడిదే అయ్యేది. పోటీ పూర్తిగా జరుగనవసరం లేదనిపించి మధ్యలో నిలుపు చేశాను. సారంగుడే ఉపసైన్యాధిపతి పదవికి అర్హుడు," అని రాజుకు చెప్పాడు.

విశాఖదత్తుడు విద్యారణ్యుడి వంక చూశాడు.

"ప్రభూ! ఆవేశం ప్రతిభను మరుగు పరుస్తుంది. సామర్థ్యాన్ని వెనక్కు నెడుతుంది. ఆవేశపూరితుడు పొరపాట్లెక్కువ చేసే అవకాశముంది. పాతిక సంవత్సరాలు క్రితం జరిగిన పోటీలో నేను గణపతి దేవుడితో ఓడిపోయాను అందుకు ప్రతీకారంగా నాకుమారుడు గణపతి దేవుడి కుమారుడైన అనంతుణ్ణి ఓడించాలని పట్టు బట్టి నట్లున్నాడు. ఆ పట్టుదల అతడిలో ఆవేశాన్ని రగిల్చింది. అది తప్పు. పోటీలో ప్రతిభకు బదులు ఆవేశాన్ని చూపించే సారంగుడి ప్రవర్తనకు విభ్రముడై తాత్కాలికంగా అనంతుడు వెనుకంజవేసి ఉండవచ్చు. కాని, అతడిలో ఆవేశం లేదు. అందువల్ల పోటీ తుదిదాకా జరిగితే అనంతుడే విజయం సాధించి ఉండేవాడని నానమ్మకం. ఉపసైన్యాధిపతికి అనంతుడే తగినవాడు," అన్నాడు విద్యారణ్యుడు.

ఇద్దరి అభిప్రాయాలనూ విన్నాక విశాఖదత్తుడు, "పోటీని పూర్తిగా జరుపక పోవడం వలన సత్యాన్ని

ఊహించాల్సిన అగత్యం ఏర్పడింది. మరోసారి వీరి మధ్య పోటీ ఏర్పాటు చేద్దాం," అన్నాడు.

రాజు నిర్ణయం ప్రకారం కాసేపయ్యాక అనంతుడు, సారంగుడు తిరిగి ఖడ్గ యుద్ధం ప్రారంభించారు.

విశాఖదత్తుడు వారు పోరాడే తీరు తెన్నులను శ్రద్ధగా గమనించ సాగాడు. సారంగుడి కత్తి యుద్ధంలో చురుకు తనముంది. అనంతుడిలో ఓర్పు, నేర్పు కపబడుతున్నాయి. కాసేపటికి సారంగుడిలో అలసట చిహ్నాలు కనబడ్డాయి. పోటీలో మరికాసేపు కొనసాగితే సారంగుడి ఓటమి తథ్యమని ఖడ్గ విద్యలో బాగా అనుభవమున్న విశాఖదత్తుడు, విద్యారణ్యుడు, గణపతి దేవుడు గ్రహించ గలిగారు.

"పోటీ ఆపండి! ఈనాటి నుంచీ సారంగుడు ఉపసైన్యాధిపతి. అనంతుడు గణపతిదేవుడి ఖడ్గ విద్యాలయంలో శిక్షకుడిగా ఉంటాడు. అతడికి సైన్యాధిపతితో సమానంగా వేతన మిస్తాం," అన్నాడు విశాఖదత్తుడు.

ఈ నిర్ణయానికి గణపతిదేవుడు, విద్యారణ్యుడు కూడా ఎంతో సంతోషించినట్లు కనబడ్డారు.

కరాళుడింత వరకే కథ చెప్పి, "విశాఖ దత్తుడి నిర్ణయం సమంజసంగా ఉన్నదని నాకుతోచటం లేదు. పోటీని కడదాకా కొనసాగించాలని తానే అన్నప్పటికీ రాజా నిర్ణయానికెందుకు కట్టుబడలేదు? రాజుకు సారంగుడిపై పక్షపాత బుద్ధి ఉన్నట్లు ఆయన తీర్పును బట్టి తెలుస్తూనే



ఉంది. మొదటి సారి పోటీలో సారంగుడే నెగ్గేలా అనిపించడం వల్ల రాజు సారంగుడే నెగ్గుతాడని నమ్మి పోటీని కడదాకా కొనసాగించాలన్నాడు. అయితే, సారంగుడు ఓడిపోయే ప్రమాదం కనపడగానే ఆయన పోటీని సగంలో ఆపు చేయించి తన కిష్టమైన వాణ్ణి ఎన్నిక చేశాడు. రాజు పక్షపాతి బుద్ధితో తీసుకున్న ఈ నిర్ణయం గణపతిదేవుడు, విద్యారణ్యుల కెలా సంతోషం కలిగించిందో నాకర్థం కావటం లేదు. అంతకు ముందు జరిగిన పోటీలో వారిరువురికీ పక్షపాత బుద్ధి బొత్తిగా లేదని ఋజువయింది కదా! ఓ సవిత్రుక మహారాజా! తెలిసి కూడా నా యీ ప్రశ్నకు జవాబు చెప్పకపోయావో నీవు నాకు బానిసవు కావాల్సి ఉంటుంది," అన్నాడు.

దీనికి సవిత్సుకుడీ విధంగా బదులిచ్చాడు.

"విశాఖదత్తుడి నిర్ణయానికి మూలం పాతిక సంవత్సరాల క్రితం అతడి తండ్రి విష్ణుదత్తుడు తీసుకున్న నిర్ణయమే! నిజానికి గణపతిదేవుడు, విద్యారణ్యుడు ఖడ్గవిద్యలో సరిసమానము. జయాపజయాలు దైవాధీనాలు. కాబట్టి పోటీ సమయంలో గణపతిదేవుడు విజయం సాధించ టం జరిగింది. అయితే ఖడ్గ విద్యలో పట్టుద ల,ఓర్పు ఎక్కువగా కల గణపతిదేవుడు సైన్యా ధిపతిగా కంటె విద్యాలయాధిపతిగా ఎక్కువగా రాణిస్తాడని విష్ణుదత్తుడు భావించాడు. ఆయన నిర్ణయంలో దేశ క్షేమమే తప్ప పక్షపాత బుద్ధి లేదు. ఆయన నిర్ణయం గొప్పదనటానికి ఋజువుగా దేశంలోని మేటి కత్తి యుద్ధ నిపుణు లందరూ గణపతి దేవుడి ఖడ్గ విద్యాలయానికి చెందినవరే! ఆనాడు విష్ణుదత్తుడు తీసుకున్న విధంగానే ఈనాడు విశాఖదత్తుడు నిర్ణయం తీసుకున్నాడు. అయితే విష్ణుదత్తుడి నిర్ణయం ఆయన కపవాదును తెచ్చిపెట్టింది. అందుకు కారణం పోటీని పూర్తిగా కొనసాగించడమే! అనంతుడిలో మంచి గురువు కుండాల్సిన లక్షణా లున్నాయని గమనించగానే విశాఖదత్తుడా పోటీని మధ్యలో ఆపి అతడికి విజయావకాశము లేకుండా చేశాడు. పోటీ పూర్తిగా జరక్కపోవటం వల్ల రాజు అన్యాయం చేశాడన్న అపవాదు కూడా తప్పింది.

"ఒకసారి అనంతుడు, మరొకసారి సారంగుడు పోటీలో నెగ్గే అవకాశం కనిపించింది. వారిలో ఏ ఒక్కరూ ఒకరికొకరు తీసిపోరని నిర్ణయా మయ్యా కనే ఉప సైన్యాధిపతి ఎన్నిక జరుగడం అన్ని విధాలా గణపతిదేవుడికీ, విద్యారణ్యుడికీ సంతో షం కలిగించటం సహజమే!

"అన్ని విధాలా రాజ నిర్ణయం సమంజసమైనదే తప్ప అందులో పక్షపాత బుద్ధిలేదు."

అనిసరియైన సమాధానం కావటంలో సవిత్సు కుడి కెదురుగా ఉన్న కన్యపై కరాళుడి ప్రభావం నశించి ఆయువతి వ్యాలు.ఎబంటిగా మారి అడవి లోకి పరుగుతీసింది.





# న్యాయపాలకుడు

ఢిల్లీ చక్రవర్తి గియోసుద్దీన్ ఒకరోజు అప్రయత్నంగా బాణం గురి తప్పాడు. ఆ బాణం ఒక పసిబాలుడి ప్రాణం తీసింది.

బాలుడి తల్లి న్యాయాధీశుడైన సిరాజుద్దీన్ వద్దకు వెళ్ళి ఫిర్యాదు చేసింది.

సిరాజుద్దీన్ వెంటనే విషయం తెలియబరుస్తూ చక్రవర్తికి కబురంపించాడు.

గియాసుద్దీన్ చక్రవర్తి తన ఆభరణాలన్నీ తీసేసి, సామాన్యుడి వస్త్రాలు ధరించి న్యాయస్థానానికి వెళ్ళి "విచారణ అవసరం లేదు. నేను నా నేరాన్ని ఒప్పుకుంటున్నాను. ఏ శిక్ష విధించినా సిద్ధమే!" అన్నాడు.

సిరాజుద్దీన్ గంభీరంగా, "తెలిసి హత్య చేసిన వాడికి మరణ దండన తగిన శిక్ష. కాని ఈ హత్య అనుకోకుండా జరిగింది. ఇందుకు మీ అజాగ్రత్తే కారణం. న్యాయస్థానం మీకే శిక్ష విధించినా ఒక కన్నతల్లి కడుపు శోకాన్ని తగ్గించ లేదు. కాబట్టి ఆ కన్నతల్లే తమకు తగిన శిక్ష నిర్ణయిస్తుంది," అన్నాడు.

గియోసుద్దీన్ బాలుడి తల్లివంక తిరిగి, "అమ్మా! న్యాయాధీశుడిమాట నాకు శిరోధార్యం. నీవే శిక్ష విధించినా, అందుకు నేను సిద్ధం. కావాలంటే ఈ కత్తితో నీవు నాతలను నరకవచ్చు" అన్నాడు.

అందుకా స్త్రీ కంగారు పడుతూ, "ప్రభూ! కడుపు శోకంతో నాకు మీపై కక్ష పుట్టిన మాట నిజమే! కానీ మీవంటి ధర్మాత్ములను చంపటానికి నాకు చేతులెలా వస్తాయి? మిమ్మల్ని చంపటంవల్ల పోయిన నాబిడ్డ తిరిగొస్తాడా? నాకు పతి ఉన్నాడు. ఇంకా బిడ్డలున్నారు. ఈ బిడ్డ నాదురదృష్టం కొద్దీ చనిపోయాడను కుంటాను. తమపై ఫిర్యాదు

కోలార్ కృష్ణ అయ్యర్

చేయటం నా అజ్ఞానమని ఇప్పుడర్థమవుతోంది. మీరు ఎప్పటికీలా తిరిగి రాజ్యపరిపాలన చేయటమే నాకు సంతోషాన్నిస్తుంది," అంది.

గియాసుద్దీన్ వెంటనే ఆ స్త్రీకి నమస్కరించి, "అమ్మా! నీవు ఉత్తమురాలివి. నా మొదటి తప్పును కాశావు. కృతజ్ఞుణ్ణి. నావల్ల రెండో తప్పు జరిగితే, ఆ దేవుడు క్షమించినా నన్ను నేను క్షమించుకోలేను. అప్పుడు నాకు మరణ దండన తప్పనిసరి," అని చెప్పి, ఆమెకు లెక్క లేనంత బంగారం కానుకగా యిచ్చి సగౌరవంగా పంపించి వేశాడు.

అప్పుడు సిరాజుద్దీన్ తన ఆసనం దిగి, "ఇంతసేపూ నేను కూర్చుని మిమ్మల్ని నిలబెట్టాను. ఇలాంటి పరిస్థితి ఏర్పడినందుకు నాకు బాధగా ఉంది," అన్నాడు.

గియాసుద్దీన్ నవ్వి "ఖాజీగారూ! మీరు మీ తీర్పును సక్రమంగానూ, నిర్భయంగానూ ఇచ్చి నాదేశంలో న్యాయాచరణకున్న ప్రాముఖ్యతను నిరూపించారు. అందుకు నాకు చాలా సంతోషంగా ఉంది. మీరే కనుక నేను చక్రవర్తిననే భావంతో నన్ను శిక్షించక వదిలిపెట్టి ఉంటే, నాకత్తితో మీ తల నరికి ఉండేవాణ్ణి" అంటూ ఒకసారి తన కత్తిని ఝుళిపించాడు.

"ప్రభూ! బుద్ధిగా మీరేదాన్ని అంగీకరించినందుకే నేను మీకీ మర్యాదనిస్తున్నాను. లేకుంటే ఈ బెత్తంతో మీ వీపు మీద వాయించి ఉండేవాణ్ణి" అంటూ సియాజుద్దీన్ తన చేతిలోని బెత్తాన్ని ఝుళిపించాడు.

న్యాయ పాలనలో ఎవరికి వారేసాటి అయిన వారికాలంలో ప్రజలందరూ వారినే ఆదర్శంగా ఎంచుకుని నేరాలెరుగకుండా సుఖంగా జీవించారు.





# అంతఃపుర రాక్షసి

ఒకానొకప్పుడు మగధదేశాన్ని త్రిలోక సేనుడనే మహారాజు పరిపాలించేవాడు. ఆయన ప్రజల్ని కన్న బిడ్డల్లా చూసుకుంటే ప్రజలాయన్ని దేవుడిలా భావించేవారు. రాజ్యం సభిక్షంగా ఉండి పొరుగు రాజులంతో త్రిలోక సేనుడి అదృష్టానికి అసూయ పడుతున్న తరుణంలో తరుణ వయస్కురాలైన మహారాణి సునందాదేవి పండంటి మగబిడ్డనుకని అకాల మృత్యువుకు గురయింది.

అప్పుడు త్రిలోక సేనుడు అంతులేని విచారానికి గురయ్యాడు: ఆయన అన్ని సుఖాలూ విడిచిపెట్టి అంతఃపురంలో మూలగదిలో కూర్చుని చనిపోయిన మహా రాణినే తల్చుకుంటూ దిగులుగా ఉండేవాడు. రాచకార్యాలన్నీ మంత్రులే చూస్తున్నారు.

క్రమంగా రాజులో మార్పు రాగలదని మంత్రులాశించారు కానీ, రాజకుమారుడికి నాలుగేళ్ళు వయసొచ్చినా ఆయన దిగులు తగ్గక పోయేసరికి అంతా కంగారు పడ్డారు. రాజిలాగున్నాడని తెలిస్తే ప్రజల్లో కలకలం పుడుతుంది. పొరుగు రాజులకు దుర్బుద్ధి పుట్ట వచ్చు. అదీకాక, రాజు జోక్యం లేకుండా సమర్థవంతంగా రాజ్యపాలన చేయటం కలకాలం మంత్రులకు సాధ్యపడదు.

మంత్రులందరూ సమాలోచన జరిపారు.

వారిలో వృద్ధ మంత్రి, "రాజు మామూలు మనిషి కావాలంటే ఆయన్ను అంతఃపురంనుంచి కదపాలి. అందుకు నాకొక్కటే మార్గం కనిపిస్తోంది. సమీపారణ్యంలోని క్రూరమృగాలు ప్రజల్ని బాధిస్తున్నాయనీ, వాటిని వారించటం ఎవరికీ సాధ్యం కాదనీ రాజుకు మనం నచ్చజెపితే, అప్పుడాయన వేటకు బయలుదేరుతాడు. వేట సప్తవ్యసనాల్లోని ఒకటి. క్రమంగా రాజు మామూలు మనిషి కాగలడు," అన్నాడు.

దీనికి మిగతా మంత్రులు సరేనన్నారు.

ఈ ఉపాయం ఫలించింది. రాజు వేటకు బయలుదేరాడు.

వసుంధర

సమీపారణ్యంలోకి కొత్తగా ఓ రాక్షసి వచ్చింది. అది అరణ్యంలో తనకు కనిపించిన జంతువుల్ని ఇచ్ఛవచ్చినట్లు చంపితింటూ భీభత్సం సృష్టిస్తోంది. ఆ కారణంగా అక్కడి జంతువులన్నీ అడవి వదిలి చుట్టు పక్కల గ్రామాలమీదపడి రాజ్యంలో భీభత్సం సృష్టిస్తున్నాయి. మామూలుగా అయితే కొంత సైన్యాన్ని పంపించి ఈ ప్రమాదాన్ని నివారించవచ్చు. కాని, రాజును కదపాలనుకున్న మంత్రులిది సదవకాశంగా భావించారు.

త్రిలోకసేనుడు అడవిలో అడుగు పెట్టగానే దూరాన ఓ చెట్టుమీంచి రాక్షసి చూసింది. నరభక్షణ చేసి చాలాకాలం అయినందువల్ల రాజు, సైన్యం ముందు దానికి కనులు విందు చేశారు. అయితే రాజును కాస్త దగ్గరగా చూసే సరికి లక్ష్మణుని చూసిన శూర్పణఖలా దానికి మనసు చలించింది.

సహజంగా త్రిలోకసేనుడు అందగాడు. ఆపైన మహారాజు. విలువైన దుస్తుల్లో, వేట తమకంలో దివ్య తేజంతో వెలిగి పోతున్నాడు.

రాక్షసి ఎంతో సమయం వృథా చేయలేదు. అది అరణ్యంలో అప్పటికప్పుడు మాయా మున్యాశ్రమాన్ని సృష్టించింది. అందులో మాయామునులు మునిపత్నులు ఉన్నారు. రాక్షసి తపోర ముని కన్యగా మారింది.

వేటాడి అలసిపోయిన రాజు మాయా మున్యాశ్రమం చేరుకున్నాడు. అక్కడ చెలుల మధ్య శకుంతలలాగా వెలిగి పోతున్న మాయా మునికన్యను చూశాడు. రాజుకామెలో సునందాదేవి పోలికలు కనిపించాయి. అంతే! ఆయన మనసు చలించింది.

"సునందా!" అంటూ రాజామెను సమీపించాడు.





మాయాముని కన్య తడబడి నట్లు నటించింది. రాజామెచేయి పట్టుకోగానే, ఆమె మృదువుగా విడిపించుకుని, "చూస్తూంటే ఏదేశానికో రాజులా ఉన్నారు. నేను అబలను, అసహాయు రాలిని-మునికన్యను. ఈ విధంగా పాణి గ్రహణం చేయటం తమకు తగునా!" అంది.

రాజు తొట్రుపడి, "తొందరపడ్డాను. నన్ను మన్నించు. నీలోచని పోయిన నారాణి సునంద పోలికలు కనపడటంతో నేను నిగ్రహించుకోలేక పోయాను," అన్నాడు.

"మీరు నాచేయి పట్టుకున్నారు. పాణిగ్రహ ణం.చేస్తే వివాహమైనట్లే లెక్క. నేనిప్పుడేంచేసేది? నన్ను మీరైనా పెళ్ళి చేసుకోవాలి. లేదా ఆజన్మాంతం నేను కన్యగా మిగిలిపోవాలి," అంది మాయా ముని కన్య దిగులు నటిస్తూ.

"సుందరీ! దిగులు పడకు. నీపేరేమిటో చెప్పు. నీకిష్టమైతే నీ పెద్దల నడిగి, నిన్ను వివాహం చేసుకోగలను," అన్నాడు త్రిలోక సేనుడు.

"అదేమి చిత్రమో! నాపేరు కూడా సునంద యే! నేను కూడా తొలిచూపులోనే మిమ్మల్ని ప్రేమించాను. మిమ్మల్ని వివాహం చేసుకోవ టము అదృష్టమనుకుంటాను. నా పెద్దల అను

జూలై నెల
బొమ్మల సంభాషణ
ఫలితాలు-1



ఋషి: తపస్సు చేస్తే భంగ పరచటానికి ఏ మేనకో ప్రత్యక్షమ వుతుందనుకుంటే, నువ్వు దాపు రించావేమిటీ?

ప్రేతాత్మ: నేను నిజంగా మేనక నే. వయస్సు మళ్ళిపోయి కొన్త సౌందర్యం తగ్గింది. అలా స్వర్గంలో విహరిద్దాంరా, ప్రియా !

—ఇట్లా శ్రీనివాసరామం,
ధవళేశ్వరం



"మతి తీసుకోండి," అంది మాయా మునే కన్య.

అక్కడ అన్నీ రాక్షసి చేసిన ఏర్పాట్లే కాబట్టి త్రిలోకసేనుడికీ, మాయా సునందకూ ఆ రోజే వివాహమైపోయింది. ఇద్దరూ తిరిగి రాజ్యానికి వెళ్ళారు. మంత్రులు కొత్త రాణిని చూచి, పూర్వపు రాణినే పోలి ఉన్నందుకాశ్చర్యపడ్డారు.

కొత్త రాణి రాక రాజులో మంత్రులు కోరిన మార్పు తీసుకుని వచ్చింది. ఆయన గత స్మృతులు నుంచి కొత్త ఉత్సాహంతో పూర్వంకంటే చక్కగా రాజ్యపాలన చేయసాగాడు.

మాయా సునందకు అంతఃపుర జీవితంబాగుంది. కోరిన వాడు భర్త అయ్యాడు. కోరినంత తిండి లభిస్తోంది. సేవలు చేయటానికి లెక్కలేనంత మంది దాస దాసీ జనం. అయితే ఒక్కటే లోటు. అంతముంది మనుమల మధ్య ఉంటూ, నరవాసనను పీల్చుతూ నరభక్షణ చేయకుండా నిగ్రహించుకోవటం ఆమె చాలాకష్టంగా ఉంది. అందువల్ల కొంత కాలం కాగానే అది రాత్రి సమయంలో లేచి ఎవరికీ తెలియకుండా అంతఃపురంలో ఓ మనిషిని చంపితిని ఎముకల గుట్టను ఎక్కడో ఓమూల ఉంచేది.

కొంత కాలం జరిగింది. మొదట్లో మనుములు మాయామవుతుంటే, ఎవరూ అనుమానించలేదు. కాని, రోజు కొకరు చొప్పున మాయమవుతుంటే ఎప్పటికోఅప్పటికి కలకలం పుట్టక మానుతుందా!

అంతఃపుర నమన్యలను కూడా ముందుగా వృద్ధ మంత్రికి నివేదించటం ఆదేశపు నంప్రదాయం. అంతఃపురం కావలావాడు మంత్రికి విషయం చెప్పాడు. మంత్రి వెంటనే పోయిన వారెవరెవరో తెలునుకుని వాళ్ళ గురించి పూర్తి వివరాలు సేకరించాడు. అంతాకూడా అంతఃపురంలోనే మాయమైనారని రూఢీ అయింది. అప్పుడు మంత్రి రాజుకు కూడా తెలియకుండా అంతఃపురాన్ని తనే ఏదోవంకపై నందర్శించి తీవ్రంగా శోధించి ఒక గదిలో మూలగా పడి ఉన్న ఎముకల గుట్టను చూశాడు. అవి మనుషుల ఎముకలేనని నిర్ధారించటానికాయనకెంతో సేపు పట్టలేదు.

అప్పుడు మంత్రి నిశ్చేష్టుడయ్యాడు. అంతఃపురంలో మనుషులు మాయంకావటం, అక్కడే ఓ గదిలో మనుషుల ఎముకలు గుట్టలుగా పడి ఉండడం! ఎంత ఆలోచించినా



అయనకు విషయం స్ఫురించలేదు.

అయన కాపలా వాడితో, "ఒరేయ్, ఈ రాత్రంతా నువ్వు మెలకువగా ఉండి ఈ గదిలోని కెవరు వెడతారో కనిపెట్టు," అని చెప్పాడు.



జూలై నెల
బొమ్మల సంభావన
ఫలితాలు-2



దయ్యం: ఏమయ్యా భూత వైద్యుడూ! నువ్వు చెప్పినట్లు నేను అందర్నీ పట్టుకొని, పీడించి నీకు బేరాలు వచ్చేలాగా చేస్తాను. కాని ఒక్క షరతువుంది అది...

భూతవైద్యుడు: ఏమిటి అది ?

దయ్యం: అబ్బే ఏమీలేదు! కొన్నాళ్ళకు నువ్వు కూడా నాలా మారి, నాకు తోడుగా ఉండాలి. సరేనా ?

—వి.ఎం.రావు, కనకాల, కాకినాడ

కానీ మర్నాడా కాపలా వాడు వచ్చి, "అయ్యా! ఎంత అవుకుందామన్నా నా నిద్ర ఆగలేదు. ఇలానాకెప్పుడూ జరగలేదు. ఇదంతా చూస్తూంటే, ఇది మామూలు మనుషుల పని కాదని పిస్తోంది," అన్నాడు.

ఏదో మానవాతీత శక్తి ఈ పని చేస్తోందని

మంత్రికి అనుమానం వచ్చింది. అయన ఆరోజు కాళికాదేవి ఆలయానికి వెళ్ళి మంత్రించిన కుంకం తీసుకున్నాడు. ఆ కుంకం పెట్టుకుంటే ఏ మంత్రశక్తి మనిషిపై ప్రభావం చూపించ లేదు.

ఆ రాత్రి మంత్రి తానే అంతఃపురంలో కావలా వాడి స్థానం తీసుకున్నాడు. అప్పుడు అర్ధరాత్రి



వూట మాయానునంద మనిషిని తినే భయంకర దృశ్యాన్నాయన చాటుగా ఉండి చాశాడు. అప్పు

జూలై నెల
బొమ్మల సంభాషణ
ఫలితాలు-3



అతడు: విశ్వామిత్ర వేషం వేస్తే, మేనక వస్తుందన్నారు. నువ్వు వచ్చావేమిటి?
దయ్యం: నేను బ్రతికివున్నప్పుడు, నా పేరు మేనకేలే! వేర్యాను కొని నన్ను ప్రేమించు. లేకపోతే...

—పామర్తి గీత,
భువనేశ్వర్

డాయన వళ్ళంతా భయంతో వణికింది. మహారాజు పెళ్ళి చేసుకున్నది మనిషిని కాదనీ,



రాక్షసిననీ అర్థం కావటంతో ఏంచేయాలో పాలుపోలేదాయనకు.

మాయా సునంద మనిషిని తినేసి మిగిలిన ఎముకలనన్నింటినీ తిన్నగా తానెప్పుడూ వేసే గదిలో వేసింది.

అప్పుడు మంత్రి ధైర్యంచేసి ఆమె ఎదుట పడి, "నువ్వు మహారాణివై మా రాజును

జూలై నెల
బొమ్మల సంభాషణ
ఫలితాలు-4



సాధువు: నేను ఎంత బికారి వెధవలాగా వున్నానో చూస్తూ న్నావు కదా! అయినా, నువ్వు చచ్చి దయ్యానివై కూడా, ఆ అప్పు తీర్చమనటం న్యాయంగా లేదు, అప్పులస్వామీ!

దయ్యం: చచ్చి సాధించటం అంటే, ఇదేనోయ్, నాయనా!

— మతంగల జయలక్ష్మి
విజయనగరం

మనిషిని చేశావని సంతోషించాం, కాని, ఇలా రాక్షసివై మా ప్రజల్నే చంపి తింటావనుకోలేదు," అన్నాడు.

మాయాసునంద తడబడి, "నా మాయా ప్రభావంతో అందరికీ స్పృహ తప్పించాను. నువ్వు స్పృహలో ఉండటం ఆశ్చర్యంగా ఉంది. నారహస్యం తెలిసిన నిన్ను బ్రతకనివ్వను. ఇప్పుడే నిన్ను విరుచుకుని తింటాను," అంది.

మంత్రి నవ్వి, "నీ శక్తులు నాపై పని చేయవు. నేను మంత్రించిన కాళికాదేవి కుంకుమ పెట్టుకున్నాను," అన్నాడు.

మాయాసునంద కంగారు పడి, "నా రహస్యం రాజుకు చెప్పవద్దు. చెప్పినా ఆయన నన్నేమీ చేయలేడు కాని, నాతో యిక కాపురం చేయడు.

అయన్ను నేను ప్రేమిస్తున్నాను. అయన లేకుండా బ్రతక లేను. నీకోరికలేంటో చెప్పు. తీర్చగలను. నా రహస్యం మాత్రం బయట పెట్టకు," అంది.

"అమ్మా! నీ ప్రేమ నిజంగా చాలా గొప్పది.



జూలై నెల
బొమ్మల సంభాషణ
ఫలితాలు-5



మంత్రగాడు: అరేదే, ఇదేమిటి? నువ్వు ఇక్కడికి వచ్చావేమిటి?
దయ్యం: ఒరేయ్! నేను ఎవరిని ఆశ్రయించినా, నువ్వు రావటం వారికి తాయత్తు కట్టటం జరుగుతోంది. అలా నాకు ఆశ్రయం లేకుండా చేస్తున్నావు? ఇకపోతే, నాకు మిగిలింది నువ్వే! నిన్ను ఆశ్రయిస్తే, ఎంతో సౌకర్యంగా వుంటుందో కదా, అని ఇలా వచ్చాను. అంతే.

—ఎ. లింగేశ్వర్,
కుమార్‌గల్లి

మనుమల్లో లేడనుకున్న మారాజుకు నీకార ణంగానే కొత్త ఉత్సాహంపుట్టింది. నీవు రాక్షసి వని తెలిస్తే ఆయన మళ్ళీ కృంగిపోతాడు. నీ కాయన మీద ప్రేమంటూ ఉంటే ఆయన



ప్రజల్ని నువ్వు కన్న బిడ్డల్లా ప్రేమించు. నీలోని రాక్షసత్వాన్ని మరిచిపో. ఇంత వరకూ జరిగింది మరిచి పో     ఇక మీదట మనుషుల్ని చంపకు," ఇదే నాకోరిక! "అన్నాడు మంత్రి.

"నీకోరికను నా శక్తి మేరకు తీర్చగలను. కాని రాక్షసిని కావటం వల్ల నరభక్షణ చేయకుండా ఎంతో కాలం నిగ్రహించుకోలేను," అంది మాయా సునంద.

"అయితే అంతఃపురవాసులందరూ కాళీ కుంకుమ ధరించే ఏర్పాటు చేస్తాను. అప్పుడు నీవు అదుపులోకి వస్తావు," అన్నాడు మంత్రి.

మాయా సునంద నిట్టూర్చి, "ఏమో! నరభక్షణ చేయాలన్న కోర్కెతో నేనెప్పుడు రాత్రిపూట అంతఃపురాన్ని విడిచి పెడుతుంటానో!" అంది.

"దీనికి వేరే ఉపాయం లేదా?" అన్నాడు మంత్రి దిగులుగా.

మాయా సునంద కాసేపాలోచించి, "ద్వైతవనంలో సుధాముడనే ముని ఉన్నాడు. ఆయన

సర్వశక్తి సంపన్నుడు. ఆయనకు భయపడే నేనక్కడ్నించి పారిపోయి మగధ సమీపానికి వచ్చి మీ రాజును చూసి ఆకర్షించబడ్డాను. ఆయన నడిగితే దీనికేదైనా ఉపాయం చెప్ప గలడు," అంది.

"అయితే సరే, నేను సుధాముణ్ణి కలును కుంటాను. అంతవరకూ నీవు నిన్ను నిగ్రహించు





"ఈ వీధిలో అయిదేళ్ళుగా అడు క్కుంటూన్న నన్ను, ఎంతగానో ఆదరించిన అందరికీ ఇవి ఇస్తూ న్నాను. తీసుకోండమ్మా!"

"ఏమిటది?"

"నా సొంత థియేటర్లో సినిమా ఉచితంగా చూడ్డానికి బాల్కనీ టిక్కెట్టులే తల్లీ!"

—జె. శ్రీనివాసరావు,
విజయవాడ

కోవాలి," అన్నాడు మంత్రి.

మాయాసునంద సరేనన్నది.

మర్నాడు తెల్ల వారగానే మంత్రి ద్వైతవనానికి బయలుదేరి వెళ్ళి సుధాముణ్ణి కలుసుకున్నాడు.

ఆ ముని మంత్రి చెప్పిన దంతావిని, "ప్ర

జల్ని కన్న బిడ్డల్లా ఏలే మీ రాజు ధన్యుడు. సదా ఆయన క్షేమాన్ని కోరే నీవంటి మంత్రులు ధన్యులు. రాక్షసిగా ఉండి మనిషి ప్రేమకు కట్టుబడ్డ మాయానునంద ధన్యురాలు. ఆమెలోని రాక్షస ప్రవృత్తిని శాశ్వతంగా దూరంచేయటమే అన్ని సమస్యలకూ పరిష్కారం. అందుకొక్కటే మార్గమున్నది," అన్నాడు.

"చెప్పండి మునివర్యా! తక్షణం పాటిస్తాను," అన్నాడు మంత్రి.

"మాయానునంద రాక్షసి. కాని, ఆమె మనిషిని ప్రేమించి అతడితోనే కాలంగడిపేయ లనుకుంటోంది. తన రాక్షస ప్రవృత్తిని నాశనం చేయాలని మనస్ఫూర్తిగా అనుకుంది. కాబట్టే ఆమె నిన్ను నా దగ్గరకు పంపింది. దీన్నే రాక్షసుల్లో మానవత్వం మంటారు. అదేవిధంగా మనుమల్లో రాక్షసులూ ఉంటారు. ఈ





ప్రపంచంలో దుర్మార్గాలు చేసే రాజులెందరో ఉంటారు. నీ రాణి వారిని కలుసుకొని వారు చేసే దుర్మార్గాల గురించి ప్రస్తావించాలి ఆ ప్రస్తావన రాగానే కొందరు సిగ్గు పడతారు. కొందరు మాత్రం అహంకారంతో సమర్థించు కుంటారు. అలాంటి ఒక్కరు నీ మాయాను నందకు తటస్థపడితే చాలు. వారికి ఆమె రాక్షసత్వం చేరిపోతుంది. వారి మానవత్వం ఆమెను చేరుకుంటుంది," అన్నాడు సుధాముడు.

వినయశీలుడింకా ఏదో చెప్పబోతుండగా, "ఇంక కథ అవు. తర్వాతేం జరిగిందో నాకు తెలిసింది," అన్నది మహారాణి.

సుధాముని మాటమీద మంత్రి తనవద్దకే వచ్చినట్లామెకుతోచింది. "అంతఃపుర రాక్షసి మాయానునంద కాదు, నువ్వే!" అని అంతరాత్మ


ఆమెకు చెబుతున్నట్లుంది.
వినయశీలుడు కథ ఆపి వేశాడు మహారాణి అక్కణ్ణించి వెళ్ళిపోయింది.
మర్నాడు యధాసమయానికి యధాస్థలంలో వినయశీలుడి నావహించుకుని ఉన్న నూరుకట్ల పిశాచం యధా ప్రకారం మరో కధను చెప్పసాగింది.
—(వచ్చే నెల మరో కథ)







# మనిషి చదువు

ధర్తదత్తుడిది వాణిజ్యంలో అందెవేసినచేయి. కాశీనగరంలో అంతటి పెద్ద వర్తకుడు లేడు అంటే అతిశయోక్తి కాదు కూడా. అతడి కొడుకు న్యాయదత్తుడు చిన్నప్పట్నించీ వ్యాపారంలో శ్రద్ధ చూపిస్తూ తెలివితేటల్లో తండ్రిని మించిన వాడనిపించాడు. కాని, వాడిని గురుకులానికి వెళ్ళి విద్యాభ్యాసం చేయమంటే మాత్రం వినటంలేదు. అందుకోసం ధర్మదత్తుడు సామదాన భేధదండోపాయలన్నీ ప్రయోగించి విఫలు డయ్యాడు.

చివరికొక రోజున ధర్మదత్తుడు, "తండ్రిగా నేను నిన్ను శాసిస్తున్నాను. నీవు గురుకులానికి వెళ్ళి విద్యాభ్యాసంచేసి రావాలి. లేనివక్షంలో నాయిల్లువదిలి పెట్టి వెళ్ళిపోవాలి," అన్నాడు.

న్యాయదత్తుడు చలించకుండా, "అకారణంగా కొడుకునింట్లోంచి వెళ్ళగొట్టటం తండ్రికి న్యాయంకాదు. నేను చెడ్డవనులు చేయటంలేదు. దురలవాట్లకులోనూ కాలేదు. అనవసరమైనవి తప్ప అవసరమైనవన్నీ మీరు చెప్పినట్లు చేస్తూనే ఉన్నారు. చదువు నాకు జీవితావసరంగా తోచటంలేదు. నన్ను మీరిందుకు నిర్బధించటం అన్యాయం," అన్నాడు.

ధర్తదత్తుడింకేమీ అనలేక సమీవగురుకులానికి వెళ్ళి అక్కడి గురువైన నిత్యానందుడికి తనగోడు చెప్పుకొని తన యింటికి ఆహ్వానించాడు.

నిత్యానందుడు వెంటనే బయలుదేరి ధర్మ దత్తుడింటికి వెళ్ళి, న్యాయదత్తుడిని పిలిచి, "నాయనా! నీకు చదువు అవసరం కాదన్నావుట. ఎందుకో తెలుసుకోవచ్చా?" అన్నాడు.

"నడకరాని నాకు అమ్మ వేలువట్టుకుని నడి పించి నడకలు నేర్పించి, మాటలురాని నాచేత అన్ని మాటలూ వలికించింది అమ్మే. ఆమె నాకు గురువు. కాదంటారా?" అన్నాడు న్యాయ దత్తుడు.

"బాగా చెప్పావు నాయనా! ఆవయసులో నీకు అవసరమైన గురువు నీ తల్లి!" అన్నాడు నిత్యా

శింగిసెట్టి సంజీవరావు

నందుడు.

దానితో న్యాయదత్తుడి ముఖంలో విజయగర్వ కాంతి వచ్చింది.

"ఇంటికొచ్చిన వారితో ఎలామసలాలో చెబుతూ నాప్రవర్తనను తీర్చిదిద్ది, వ్యాపారంలోని మెలకువలన్నీ నేర్పిన నా తండ్రి, నాకు రెండో గురువు. కాదంటారా?" అని అడిగాడు ఉత్సాహంగా న్యాయదత్తుడు.

"చక్కగా చెప్పావు. కాదని ఎలాగంటాను? అంతే కాదు, మన చుట్టూ ఉన్న ప్రకృతి, సమాజం నీకు మూడో గురువుగా వర్తిస్తాయని చెప్పగలను," అన్నాడు నిత్యానందుడు.

"ఇంతమంది గురువుల దగ్గర అభ్యాసం చేస్తున్న వాడిని వేరే గురుకులంలోకివెళ్ళి నాకు పనికిరాని చదువు నేర్చుకోమనటం న్యాయంగా ఉంటేమో తమరే సెలవివ్వండి," అన్నాడు న్యాయదత్తుడు.

దీనికోసమే వేచి ఉన్నట్లుగా నిత్యానందుడు పెద్దగా నవ్వుతూ వెంటనే యిలాగన్నాడు

"పిల్లి పిల్లని నోటపట్టి స్థలం స్థలం మార్చి, నడక, పరుగు, వేట వగైరాలు నేర్పుతుంది. అది మార్జాల న్యాయం. తల్లినంటిపట్టుకుని స్థలం మారే కోతిపిల్ల చెట్లెక్కటం, దూకటం, తనంతట తనే నేర్చుకుంటుంది. ఇది మర్కట న్యాయం. మనిషి ఒకరు నేర్పగా కొంతా, తానుగా కొంతా నేర్చుకుంటాడు. ఇవి ఉభయ న్యాయం. అవసరానికి మాత్రమే కాక, జ్ఞానాన్ని పెంపొందించాలనుకున్నప్పుడే తప్ప, మనిషి జంతువు కంటె గొప్పవాడు కాలేడు. గురుముఖంగా విద్యాభ్యాసం చేస్తే తప్ప మనిషి జన్మకు సార్థకతలేదు."

న్యాయదత్తుడు మారుమాట్లాకుండా నిత్యానందుడికి నమస్కరించి గురుకులానికి వెళ్ళి విద్యాభ్యాసం చేసివచ్చాడు.






# ఉత్తమ చిత్రకారుడు

సౌజన్యపురానికి రాజైన శంతనుడు కళాపోషకుడు. అతడు ప్రతి యేటా చిత్రకళాప్రదర్శన నిర్వహించేవాడు. అందులోదేశంలోని ప్రముఖ చిత్రకారులందరూ పాల్గొనేవారు.

ఆ సంవత్సరం ఉత్తమ చిత్రకారుణ్ణి ఆస్థాన చిత్రకారుడిగా నియమించాలను కున్నాడు శంతనుడు. అంతవరకూ సౌజన్యపురంలో ఆస్థాన కవులూ, గాయకులూ ఉన్నారే తప్ప చిత్రకారులు లేరు.

విషయం తెలిసి ఆఏడాది చిత్రకళాప్రదర్శనంలో ఎక్కడెక్కడి చిత్రకారులూ ఉత్సాహంగా పాల్గొన్నారు.

అన్ని చిత్రాలూ అద్భుతంగానే ఉన్నప్పటికీ, శంతనుణ్ణి రెండే రెండు చిత్రాలు అమితంగా ఆకర్షించాయి.

అందులో ఒకటి మహారాణి దూరపు బంధువు రమాకాంతుడు వేసినది. మహారాణికి రమాకాంతుడంటే అమితప్రీతి. సమర్థత ఉన్న రాజ బంధువు నాదరించటంలో తప్పులేదనీ రమాకాంతుణ్ణి ఆస్థాన చిత్రకారుడిగా ఎన్నికచేసి ఆతణ్ణి శాశ్వతంగా రాజు కొలువులో ఉంచమనీ మహారాణి కోరింది కూడా.

రెండో చిత్రంసుధీరుడిది. అతడు మారుమూల గ్రామములో ఉంటూ గురుకులం ద్వారా చిత్రకళను ఎందరికో నేర్పుతున్నాడు. చిత్రకళలో అతడికి తెలియని మెలకువలు లేవని ప్రతీతి.

పరీక్షించి చూస్తూనే సుధీరుడి చిత్రం రమాకాంతుడి చిత్రానికి అన్నివిధాలా మిన్నగా ఉన్నదని అర్థమవుతుంది.

మహారాజు సందిగ్ధంలో పడ్డాడు. ఒక దేశానికి రాజుగా తాను తప్పుడు నిర్ణయం తీసుకోలేడు.

అలాగని మహారాణి కోరికను తిరస్కరించలేడు.

అందుకని బాగా ఆలోచించి అతడు

బూర్లెనరసింహశాస్త్రి

సుధీరుణ్ణీ, రమాకాంతుణ్ణీ ఏకాంతంలో పిలిచి, ఇలా అన్నాడు.

"అన్ని చిత్రాలలోకీ మీ యిద్దరి చిత్రాలూ మిన్నగా ఉన్నాయి. వాటిలో సుధీరుడిది ఉత్తమ మనటానికి సందేహంలేదు. అయినప్పటికీ నేను రమాకాంతుడినే ఆస్థాన చిత్రకారుడిగా ఎన్నిక చేస్తే, నాగురించి మీరే మనుకుంటారు? నాకు బంధుప్రీతి, ఆశ్రిత పక్షపాతం ఎక్కువనుకుంటారు. అవునా?"

ఇలా చెపితే రమాకాంతుడు తనకు తానే పోటీలోంచి తప్పుకుంటాడని రాజు ఆశించాడు. అది ఫలిస్తే, ఈ సమస్య సరిగ్గా పరిష్కార మవుతుందని రాజు ఆశ!

అయితే, మహారాజు ఊహించని విధంగా సుధీరుడు, "ప్రభూ! మీనిర్ణయము ఎంతో సమంజసమైంది. మీ ఆలోచన లోతైనది. ప్రజలు కూడా మిమ్మల్ని మెచ్చుకుంటారు," అని చెప్పాడు.

శంతనుడు తెల్లబోయి, "అదెలాసాధ్యం?" అన్నాడు.

"ప్రభూ! నేను నాప్రతిభను నిరూపించుకు నేందుకే తప్ప పదవికోసం చిత్రకళాదర్శనలో పాల్గొనలేదు. నేను ఆస్థాన చిత్రకారుడినైతే, నాశిష్యులేమౌతారు? నాగురుకులం ఏమైపోతుంది? మీరు ఆస్థాన చిత్రకారుడిగా నన్నెన్నికచేస్తే ఎలానిరాకరించాలా అని బెంగపడుతుంటే పరిస్థితినర్థం చేసుకుని మీరే నాసమస్యను పరిష్కరించారు. ఉత్తమ చిత్రకారుడు పదవి నాశించడు. ఇకమీదట తమరునిర్వహించే చిత్ర కళాప్రదర్శనలను పదవులతో ముడిపెట్టకండి," అన్నాడు వినయంగా.

తన సమస్యకు సులభ పరిష్కారమవ్వటమే కాక, ఉత్తమ చిత్రకారుడి గురించి తెలియజెప్పిన సుధీరుణ్ణీ ఘనంగా సత్కరించి పంపాడు శంతనుడు.





# తీరిక

రామాపురంలో సుబ్బా రాయుడి అనే వ్యక్తి వున్నాడు. అతడిలో వున్న మంచిలక్షణాలు ఏమి టంటే తన తీరిక సమయం వృథా చేసుకోవటం ఇష్ట ముండకపోవటం.

సుబ్బారాయుడి విద్యలు డబ్బు సంపాదించి పెడుతున్నాయని తెలిసి, చాలా మంది అతడి దగ్గరకు వచ్చి ఆ విద్యలు నేర్చుకునే వారు. విద్య నేర్పటానికి సుబ్బారాయుడు డబ్బు తీసుకునేవాడు.

రామనాథం సుబ్బారాయుడి స్నేహితుడు. ఇద్దరూ కలిసి ఒకే గురువు వద్ద విద్య నభ్యసించారు. తర్వాత రామనాథం వ్యాపారం ప్రారంభించి పైకి వచ్చాడు. ఊళ్ళోని కోటీశ్వరుల్లో రామనాథం కూడా ఒకడయ్యాడిప్పుడు.

అది ఎలాగో సుబ్బారాయుడికి **తెలియదు**. అది తెలుసుకోవాలన్న దుగ్ధ ఏర్పడింది.

అతడికి తనకు తెలిసినన్ని విద్యలూ తెలియవు. అయినా వాడు తన కంటే బాగా గొప్పవాడయ్యాడంటే తనకు తెలియని ఏవో కొత్త విద్యలు వాడికి తెలిసిండాలని సుబ్బారాయుడు అనుకున్నాడు. తాను కూడా అవి తెలుసుకుని మరింత నేర్చుకొని గడించాలన్న ఆశతో అతడు రామనాథాన్ని కలుసుకుందుకు వెళ్ళాడు.

మొదటి సారి సుబ్బారాయుడు వెళ్ళినప్పుడు, రామనాథం ఊళ్ళో లేడు.

రెండో సారి వెళ్ళినప్పుడు ఇంట్లో లేడు. మూడో సారి వెళ్ళినపుడు రామనాథం ఇంట్లోనే ఉన్నాడు కానీ ఎవర్నీ కలుసుకోనన్నాడు.

సుబ్బారాయుడికి చాలా కోపం వచ్చింది. రామనాథానికి తనెందుకు వస్తున్నదీ తెలిసిపోయుంటుందనీ, వాడి విద్యలు తనకు నేర్పటం ఇష్టంలేదని సుబ్బారాయుడనుకున్నాడు. అది అతడికి బాధ కలిగించింది.

ఒక రోజున వీధిలో నడుస్తూండగా అనుకోకుండా సుబ్బారాయుడికి రామనాథం ఎదురు పడ్డాడు.

సుబ్బారాయుడు పలకరించ బోతే, "పని మీద రత్నాల సెట్టి ఇంటికి వెడుతున్నాను. మనం తర్వాత కలుసుకుని మాట్లాడుకుందాం," అన్నాడు రామనాథం.

సుబ్బా రాయుడికి బాగా కోపం వచ్చి "నిన్ను కలుసుకోవాలని నెల రోజులుగా ప్రయత్నిస్తున్నాను. నీ దర్శనమే కావటం లేదు. కోటీశ్వరుడివి కాగానే చిన్న నాటి స్నేహితుణ్ణి చిన్న బుచ్చాలను కున్నావా?" అన్నాడు

రామనాథం ఎంతో నొచ్చుకుని, "నువ్వు నన్నెందుకు కలుసు కోవాలను కుంటున్నావో చెప్పు," అన్నాడు.

సుబ్బా రాయుడు తాను సాధించిన కొత్త విద్యలు గురించి చెప్పి, "అవన్నీ నీకు నేను ఉచితంగా నేర్పుతాను, నీ విద్యలు నాకు నేర్పు," అన్నాడు.

రామనాథం వెంటనే, "అన్యథా భావించకు. నీ విద్యలు నేను నేర్చుకోలేను. నా విద్యలు నీకు నేర్ప లేను," అన్నాడు.

"ఎందుకని?" అన్నాడు సుబ్బారాయుడు.

"నిజానికి నా విద్య లేమిటో నాకు తెలియదు. వ్యాపారంలో పైకి రావడం కోసం నేను క్షణం కూడా వృథా చేయకుండా శ్రమిస్తున్నాను. నా గురించి ఆలోచించుకునేందుకే నాకు తీరిక లేదు. ఇక నేనొకరి విద్యలు నేర్చుకునేటందుకూ, ఒకరికి నేర్పేందుకూతీరిక ఎక్కడిది?" అన్నాడు రామనాథం.

సుబ్బారాయుడికి జ్ఞానోదయమయి, రామనాథంతో, "తీరిక సమయాన్నుపయోగించటం కోసం నేనెన్నో విద్యలు నేర్చుకున్నాను. అసలు తీరిక లేకుండా పని చేయటం వల్లనే మనిషి గొప్ప వాడవుతాడన్న సత్యం తెలుసుకుంటే, నేనిన్ని విద్యలు నేర్పవలసిన అవసరమే ఉండేది కాదు. వచ్చిన విద్యలలో ఒక్కటుపయోగించినా నేను తీరిక లేకుండా పని చేసుకోవచ్చు. నువ్వు వెళ్ళు. నేనూ వెళుతాను," అన్నాడు.

ఆ తర్వాత నుంచిసుబ్బారాయుడు తనూ తీరిక లేకుండా పని చేసి గొప్ప వాడయ్యాడు.





# ఉత్తమ మహర్షి

రాఘడు పాలించే అవంతీ నగరంలో ఒక సంవత్సరం వానలు లేవు. ఇంద్రయాగం చేసి దేవేంద్రుణ్ణి సంతృప్తి పరిస్తే వానలు పడతాయని రాజపురోహితుడన్నాడు. ఇంద్రయాగాన్ని సామాన్యులు నిర్వహించకూడదు. అందుకు సర్వోత్తముడైన మహర్షి కావాలి.

ఇంద్రయాగాన్ని నిర్వహించగల ఉత్తమ మహర్షికి వేయి సువర్ణాలిస్తానని రామరాజు చాటింపు వేయించాడు. అది విని చాలా మంది రాజ దర్శనానికి వచ్చారు. రామరాజు మంత్రి సుబుద్ధి వారందర్నీ సగౌరవంగా ఆహ్వానించి సకల సత్కారాలూ చేసి యజ్ఞం ప్రారంభం కాగానే కబురు పంపుతానని చెప్పి పంపించి వేశాడు.

రామరాజు సుబుద్ధిని, "వీరిలో ఉత్తమ మహర్షి ఎవరో ,నిర్ణయించేవా?" అని అడిగాడు.

"లేదు ప్రభూ! మనమిచ్చే సువర్ణాలకోసం వచ్చేరంటే వీరందరిలోనూ ధనాశ ఉంది. ధనలోభం వున్నవాడు ఉత్తమ మహర్షి కానేకాడు," అంటూ సుబుద్ధి రామరాజుకి బదులిచ్చాడు..

చారుల ద్వారా వాకబు చేయగా తేజోవంతుడు యజ్ఞమిత్రుడు అనే యిద్దరు మహర్షులు చాటింపు విని కూడా రాజ దర్శనానికి రాలేదని తెలిసింది. మంత్రి వారిని స్వయంగా దర్శించి, ఆహ్వానించి రాజ భవనంలో యిద్దరికీ వేర్వేరుగా విడిదులు ఏర్పాటు చేశాడు.

ఆ తర్వాత సుబుద్ధి అటుగా వెళ్ళ లేదు. విడిదుల్లో మహర్షులకు సరైన మర్యాదలు జరుగలేదు. మూడు రోజుల తర్వాత ఆయన వెళ్ళి ముందుగా యజ్ఞమిత్రుణ్ణి కలుసుకున్నాడు. యజ్ఞమిత్రుడు సుబుద్ధిని చూస్తూనే, "వచ్చేవా, నీ కోసమే చూస్తున్నాను! నీవునన్నిక్కడికి పిలి

వి. విజయ కుమార్

చింది అవమానించటానికా? మహర్షులతో ఎలా మసలు కోవాలో తెలియని నీవొక మంత్రివా? నీ వంటి మంత్రి సలహాలతో రాజ్య పాలన చేసేవాడొక రాజా?" అంటూమండి పడ్డాడు.

సుబుద్ధి యజ్ఞ మిత్రుడి కాళ్ళ మీద పడి తప్పును మన్నించమని వేడుకొన్నాడు. తర్వాత సకల సత్కారాలతో ఆయన్ను తిరిగి అడివికి సాగనంపాడు.

అటుపైన తేజోవంతుణ్ణి కలుసు కుంటే ఆయన, "నాయనా! ఇంతకాలం ఏమై పోయావు! నీవు క్షేమమేగా! నీ ప్రభువుక్షేమమా! నా వల్ల కావలసిన కార్యమేమిటి?" అని అడి గాడు ప్రసన్నంగా.

సుబుద్ధి ఆశ్చర్యపడి, "మహర్షీ! మూడు రోజుల పాటు మీకెలాంటి మర్యాదలు జరిగాయో స్వయంగా చూడలేకపోయాను. అందుకు తమకా గ్రహం కల్గటం లేదా?" అన్నాడు.

"నాయనా! ఈ శరీరం అశాశ్వతం. దీనికి మర్యాదలెందుకు? మర్యాదలు లేకపోతే కోప మెందుకు?" అన్నాడుతేజోవంతుడు నవ్వుతూ

"మహర్షీ! ఈ శరీరం అశాశ్వతం కావచ్చు. కాని బ్రతికినంత కాలం దీన్ని పోషించాలి కదా! మా దేశంలో ఈ సంవత్సరం వానలు పడక పంటలు నష్టమై ప్రజలష్టకష్టాలూ పడుతున్నారు. అందుకు ప్రతిగా ఇంద్రయాగం చేయాలి. ధనలోభం, అహంకారం లేని తమరే ఆ యాగం నిర్వహించి దేశంలో వానలు పడేలా చేయాలి," అన్నాడు సుబుద్ధి వెంటనే.

తేజోవంతుడు అంగీకరించాడు. ఆయన ఆధ్వర్యంలో ఇంద్రయాగం జరిగింది. అవంతీ నగరంలో వానలు పడ్డాయి.

ఉత్తమ మహర్షి ఎన్నికలో చాకచక్యాన్ని ప్రద ర్శించిన మంత్రి సుబుద్ధిని రామరాజు ఘనంగా సన్మానించాడు.





# మాయాద్వీపం

7

[స్త్రీగా మారిన ప్రతాపుడికి ఆకాశవాణి ద్వారా చాలా విషయాలు తెలుస్తాయి. అడవిలోనికి ఓ కాసారాన్ని ఏ పురుషప్రాణి సమీపించినా, పార్వతీదేవి శాపం వల్ల అది స్త్రీగా రూపొందుతుందనీ, అది శాపాలంక్షే ఆ జగన్మాతే దిక్కు అనీ తెలుస్తుంది. ఆ తరవాత ప్రతాపుడు కొంతదూరం ప్రయాణించేసి, కొండదేవతకు ఓ యువతిని బలి ఇస్తూన్న కోయవారికి పరిచితుడుకాగా, వారు అతణ్ణి కొండ దేవతగా భావిస్తారు. ప్రతాపుడు ఆయువతిని రక్షించాలని అనుకుంటూ వుండగా, ఓ ఏనుగుల గుంపు గందరగోళం సృష్టిస్తుంది. —తరవాత]

కోయవాళ్లుకూడా పారిపోయే ప్రయత్నం చేస్తూండగానే కారుమేఘాల్లాంటి శరీరాలు కలిగిన బలిష్ఠములైన ఏనుగులు మెరుపు వేగంతో వచ్చి నలువేపులా చుట్టుముట్టాయి.

హఠాత్తుగా యేనుగులు కోయలను చుట్టు ముట్టటం గమనించి ప్రతాపుడు పీఠం నుండి లేచాడు. అంతక్రితం ఆడవాళ్ళు పారిపోతూ అన్నమాటలను బట్టి ఆ ఏనుగులు చాలా ప్రమాదకరమైన వని భావించాడు. ఆ మదపుటేనుగులను ఎదుర్కొనే శక్తి కోయలకు కూడా లేనందు వల్ల, వాళ్ళంతా భయంతో ప్రతాపుడున్న చోటికి చేరారు.

కోయ పెద్ద, "తల్లే! నీచల్లని నూపుల్లో గూడాన్ని కాపాడే యిలవేలుపువు—యీ అడవి ఏనుగుల బారినుంచి మమ్మల్ని నువ్వే కాపాడాలి!" అన్నాడు.

బలి కోసం సిద్ధ పరచ బడిన కన్యను అప్పటికే ఒక ఏనుగు సమీపించి తొండాన్ని ఆ యువతి వేపు సాచింది.

శరీరం బంధనాలకు గురికావటంతో కదల మెదలలేని స్థితిలో వున్న ఆ స్త్రీ దీనంగా కేక లేసింది.

కిరణ్ . కుమారి



ప్రతాపుడు ఒరనుంచి కత్తి దూసి ముందుకు దూకాడు. రెప్పపాటు కాలంలో బలి కన్యను కబళింపనున్న అడవి ఏనుగు తొండాన్ని మధ్యకు నరికివేశాడు. క్రింద పడిన యువతిని యెడం చేతో పైకి లేవదీసి, అప్పటికే తనను సమీపించి తొండంతో వడ వ్రేయబోయిన మరో ఏనుగును కూడా మొదట ఏనుగును చేసినట్లే చేశాడు. ఓ కోయను తన దగ్గరకి రాగానే తన చేతిలోని బలి కన్యను అతడికి అందించి ప్రక్కకు తీసుకు పొమ్మని చెప్పాడు.

కోయ ఆయువతిని కోయల దగ్గరికి తీసికెళ్ళగానే ప్రతాపుడు నిడుపైన కరవాలాన్ని భయంకరంగా ఝుళిపిస్తూ ఏనుగుల గుంపు మీద పడ్డాడు.

క్రూర స్వభావం కలిగిన ఆ అడవిలోని మనుష్యులకే కాక, పాణులకు కూడా ప్రాణ సంకటంగా వుండే ఆ యేనుగుల్ని సంహరించటంలో దోషమేమీలేదని భావించిన ప్రతాపుడు వీరవిక్రమ విస్ఫూర్తితో యేనుగులమీద విజృంభించాడు.

కోయపెద్ద, "ఆహా! అమ్మోరు చూడండిరా! కత్తి ఎప్పుడు పైకెత్తుతున్నదో, ఎప్పుడు ఏనుగుల శరీరాల మీద పడుతున్నదో, యెరికే వుండటం లేదు. అమ్మోరు నిజరూపంతో వచ్చింది మనల్ని యీ యేనుగుల బారినుంచి కాపాడ్డానికే కాబోలు!" అన్నాడు.

మరోకోయ, "నిజమేదొరా! ఆ మాతల్లి మనల్ని రక్షించటానికే యింతసేపు మనకొలువులో వున్నది. లేకపోతే యింతకు ముందు మల్లే ఇట్టే కనిపించి అట్టే మాయమయ్యేది!" అన్నాడు.

ఆ విధంగా కోయలంతా ఉత్కంఠతతో చూస్తూ, యెవరికి తోచినట్లు వాళ్ళు మాట్లాడుకుంటూండగానే, ప్రతాపుడు అంతకంతకు రెట్టించిన శౌర్యధైర్యాలతో అడవి ఏనుగుల గుంపుమీద పరాక్రమించాడు.

కొన్ని ఏనుగులు తొండాలుతెగి నేలకూలాయి. మరికొన్ని కాళ్ళు ఖండింపబడి క్రిందపడి అసువులు బాశాయి. యింకొన్ని కుంభస్థలాలు వ్రయ్యలు కాగా భూమ్మీద పడి, పరలోకానికి ప్రయాణం కట్టాయి.

క్షణాలలో, ఆ గుడిముందరి ప్రదేశమంతా ఏనుగుల శవాలతో నిండిపోయింది.

చివరికి ఆ ఏనుగుల గుంపుకు నాయకత్వం

వహించిన ఓ భయంకర మదగజం తీవ్రమైన చూపులతో ప్రతాపుడిని చూస్తూ అతడిమీదికి వచ్చింది.

ప్రతాపుడు రెట్టించిన సాహసంతో ఆ ఏనుగు మీదికి లంఘించాడు. కత్తి పిడితో దాని కుంభ స్థలాన్ని చీల్చివేశాడు. ఏనుగుకు ప్రాణనాడి వంటి శక్తి కుంభస్థలంలోనే వుంటుందన్న విషయం తెలిసిన ప్రతాపుడు ఆ విధంగా చేసి, క్రిందికి దూకాడు.

మరుక్షణం కొనవూపిరితో తొండాన్ని చాచికొట్ట బోయిన ఏనుగు, ప్రతాపుడి వాడి కరవాలానికి తొండం ఖండింపబడగా, ప్రాణాలు విడిచి పెడుతూ నేలకూలింది. అత్యంత భీషణ పరాక్రమం ప్రదర్శించి అడవి ఏనుగులన్నిటినీ నిశ్శేషంగా వధించిన ప్రతాపుడు నెత్తుటితో తడిసి యెర్రగా మెరుస్తూన్న కరవాలాన్ని ఒరలో పెట్టు కుంటూండగా, కోయలంతా జేజేలు చెపుతూ అతడి దగ్గరికి వచ్చారు.

కోయపెద్ద ప్రతాపుడి ముందు సాష్టాంగపడి, "తల్లీ! నీవల్ల మాగూడెం గూడెమే బతికి బట్ట గట్టింది. నువ్వు మాకాడే వుండిపోమ్మా! అందరం రాత్రింబవళ్ళూ కొల్చుకుంటాం!" అన్నాడు.

ప్రతాపుడతడితో, "దొరా! నేను ఎక్కడ వున్నా మీ మేలు కోరుతూనే వుంటాను. ఒకేచోట స్థిరంగా వుండటం నాకు వీలుకాదు. లేచి నిల్చో." అన గానే, కోయపెద్ద లేచినిల్చున్నాడు.

తక్కిన కోయలంతా భక్తి వినయాలు ప్రదర్శిస్తూ



అలాగే నిల్చుండి పోయారు. ప్రతాపుడిచేత రక్షింపబడిన కోయకన్యకూడా బెదురు కళ్ళతో వచ్చి ప్రతాపుడి ప్రక్కన నిల్చున్నది.

అంతలో, "మా అందరిజీవితాలు నీ చేతి మీదుగా వెలుగును చూడాలని విధాత నిర్దేశించి వుండగా, నువ్వు ఒకచోట స్థిరంగా వుండటానికి వీలుకాని మాట వాస్తవమే, రాజపుత్రా!" అన్న మాటలు వినిపించగా, ప్రతాపుడితో బాటు కోయలంతా ఆమాటలు వినవచ్చిన వైపుకి తలలు త్రిప్పిచూశారు.

ఏనుగుల శరాలమీద తానూ శవమై పడిన నాయక గజం శవం అప్పుడే అంతర్థానమవు తున్నది.

ప్రతాపుడు వుత్కంఠతతో కళ్ళార్పకుండా



అలాగే చూడసాగారు.

ఏనుగుశవం స్థానంలో యోధవేషంతో భూలోక దుర్లభములైన మణిమయాంబరా భరణాదులు ధరించిన ఓ దివ్యపురుషుడు అక్కడ ఆవిర్భవించాడు.

ఆ దివ్యపురుషుడు ఆవిర్భవించి, తన చుట్టూ వున్న ఏనుగుల శవాలకేసి ఓమారు చూడగానే, శవాలన్నీ మాయమై వాటి స్థానంలో వీరవేషాలు ధరించిన దివ్యపురుషులు పొడసూపారు.

కోయలు ఒకదాని వెనుక ఒకటిగా జరుగుతూన్న ఆ విచిత్రాలకు విస్తుపోతూ యింకా యేంజరుగుతుందోనన్న ఉత్కంఠతతో అలాగే చూస్తూండిపోయారు.

కోయకన్యకు అర్థంతా అయోమయమనిపించగా ప్రతాపుడి చేతిని రెండు చేతులతో గట్టిగా పట్టుకున్నది.

దివ్య పురుషుల నాయకుడు ప్రతాపుడిని దీవిస్తూ, "రాజపుత్రా! నువ్వెవరివో మాకు తెలుసు. కాని మేమెవరమో నీకు తెలియదు. యిరవై సంవత్సరాల తర్వాత నీవల్ల శాపవిముక్తి పొందిన యీ సమయంలో మా ప్రభువు పరంగా, మా పరంగా, నీకు కృతజ్ఞతలు తెలియ జేస్తున్నాను," అన్నాడు.

అప్పటికే తక్కిన దివ్యపురుష వీరులంతా చేతులు కట్టుకుని ప్రతాపుడి యెదుట వినయంతో నిల్చుని వున్నారు.

తమ అమ్మోరిని పట్టుకుని మాటిమాటికీ, "రాజపుత్రా!" అని సంబోధిస్తూన్న దివ్య పురుషుల నాయకుడి తీరుకు విస్మయం చెందుతున్న కోయలు-అందులో యేదో పెద్ద తిరకాసు వుందని భావిస్తూ, మౌనంగా వుండిపోయారు.

ప్రతాపుడు స్నిగ్ధ గంభీరములైన చూపులను ఆ దివ్య పురుషుల నాయకుడి మీదకు ప్రసరింప జేస్తూ, "అయ్యా! మీరెవరో తెలియక పోయిన ప్పటికీ, నావల్ల మీకు జరిగిన మేలుకు చాలా సంతోషిస్తున్నాను. తమ ప్రభువెవరు? మీరెవరు? మీవంటి వేషాలు కలిగిన యిద్దరితో నాకు యింతకు ముందు రోజున పరిచయమైనది. బహుశా, మీరుకూడా వాళ్ళకి చెందిన వాళ్ళే అయివుంటారనుకుంటున్నాను. నావూహ వాస్తవమైతేసరే, లేక పోతే తమరెవరో వివరాలు చెపితే

సంతోషిస్తాను," అన్నాడు.

దివ్యపురుషుడు, "రాకుమారా! నిన్నటి దినం నీవల్ల శాపవిముక్తి చెందిన వాళ్ళు మా విద్యాధర మంత్రీ, ఆయన మిత్రుడూ అయివుంటారు. వాళ్ళుభూలోకంలో ఒకరు మర్రిచెట్టుగానూ, మరొకరు ఆ మర్రిచెట్టును ఆశ్రయించుకుని వుండే కొండచిలువ గానూ, శపింపబడినప్పుడే వాళ్ళ శాపాలు తొలిగి పోతాయని మాత్రమే నాకు తెలుసు. ఆ తర్వాత నేనూ, నా అనుచరులైన యీ విద్యాధరులు కూడా శాపం పొందటం సంభవించింది," అన్నాడు.

ప్రతాపుడు తలవూగించి, "అవును. నిన్న శాపవిముక్తి చెందిన వాళ్ళు-విద్యాధర లోక మంత్రి యైన మణిభద్రుడు, ఆయన మిత్రుడైన గుణభూషణుడు-అని వాళ్ళే చెప్పారు. మిమ్మల్నందరినీ యిలా వరసబెట్టి శపించిన వ్యక్తి యెవరు? యేకారణంవల్ల యిలా జరిగింది?" అన్నాడు.

దివ్యపురుషుడు, "క్షత్రియ నందనా! వీటి కన్నిటికీ సంబంధించిన పూర్తి వివరాలు కాలాంతరంలో నీకు తెలుస్తాయి. నేను రత్నతేజుడనే పేరుగల విద్యాధరలోక సేనాధిపతిని. వీళ్ళంతా విద్యాధరలోక దండనాయకులు. మా ప్రభుపుత్రియైన సౌభాగ్యవతి దేవసేనకు సంబంధించిన ఒకానొక విషాదకరమైన వుదంతం కారణంగా మేమంతా ఒకానొక దురహంకారపూరితుడి వల్ల యిలా శాపాల పాలు అయ్యాము.



నిన్ను ఎదుర్కొని, నీ చేత మరణించటమే మా శాపవిముక్తి. నువ్వు చెయ్యవలసిన పని యింకా చాలా వుంది. దైవం సహకరిస్తే, మళ్ళీ కలుసుకుంటాము. ప్రస్తుతానికి సెలవు," అని ప్రతాపుడిని మరోమారు దీవిస్తూ, తన అనుచరులతో బాటు మాయమయ్యాడు.

ఎవరు శాపవిముక్తి చెందినా-తమకు తటస్థపడిన శావం సంగతి మాత్రమే చెపుతూ, వెళ్ళిపోతున్నారుగాని, తక్కిన వివరాలు చెప్పని విచిత్ర స్థితి ఎందుకో ప్రతాపుడికి ఆశ్చర్యమనిపించింది.

ప్రతి ఒక్కరూ వివరాలు తర్వాత తెలుస్తాయి. అంటున్నారేగాని, ఆవివరాలు చెప్పటం వల్ల వీళ్ళకి ఒరిగే దేముంటుంది? అది దేవరహస్యం



కాబోలు!

అంతెందుకు? తాను మాత్రం తన మిత్రులకు యీ వివరాలు చెప్పాడా?

ప్రతాపుడు తనలో చెలరేగబోయే ఆలోచనలను అణచుకుంటూ ప్రక్కకు తిరిగాడు.

యిప్పుడు కోయలందరికీ తాను వాళ్ళ అమ్మోరు కాదన్న విషయం అర్థమైవుంటుంది. అయినా, తనమీదకు తిరగ బడే అవసరంగాని, ధైర్యంగాని, వాళ్ళకి లేవు.

ప్రతాపుడి వూహకి అనుగుణంగా కోయపెద్ద రెండు చేతులు నుదుట చేర్చుకుని దండంపెడుతూ, "దేవరా! తమరెవరు యీ యవ్వారమంతా యేటో అర్థమే కావటంలేదు. మీరు ఆడవేషంలో వున్న మగాడని, ఒక రాచబిడ్డడివని, శానా శానా పెద్ద పనులు సేసేవాడివని మాత్రం అర్థమైంది. నువ్వు వోరు తండ్రీ? యీ ఆడయేషంమేసి మా అమ్మోరి మాదిరి ఎందుకు వచ్చినట్లూ?" అన్నాడు.

ప్రతాపుడతన్ని ప్రశాంతంగా చూస్తూ, "నాయకా! నేను కావాలని యీ ఆడవేషం వెయ్యలేదు. ఇది నాకు శాపంవల్ల ఏర్పడిన మగువతనం," అన్నాడు.

కోయపెద్ద నొసలు చిట్లించి, "ఎట్టెట్టా? ఎక్కడెక్కడో దేవలోకాల్లోని వోళ్ళంతా శాపంతో చెట్లూ, కొండసిలవలూ, ఏనిగలూ అయిపడి వుంటే, ఆళ్ళందరి శాపాలూ పోగొట్టిన మారాజుబిడ్డడికి నీకు శాపమా? ఆచ్చెర్యంగా వుండాదే?" అన్నాడు.

ప్రతాపుడు, "ఆశ్చర్యంగా వుండినా, అనుభవించకతప్పదు కదా?" అని సంక్షిప్తంగా తన వృత్తాంతం వాళ్ళకి వివరించాడు.

అంతా విన్న తర్వాత కోయపెద్ద, 'అబ్బో-శానా పెద్ద యవ్వారం పెట్టుకుని పోతూండావే దేవరా! నువ్వు అనుకున్న పనిని పూర్తి చేసుకునే పట్టుదల నీలో వుండాలి. అదే నీకు జయం కలిగిస్తాది!" అన్నాడు.

అనంతరం, ప్రతాపుడు కోయలను వీడ్కొలిపి, తన అశ్వంమీదకు చేరాడు.

అంతవరకూ అమాయకంగానూ, వెర్రిమొర్రిగానూ వున్న కోయకన్య ముఖం గంభీరంగా మారింది.

ఆ యువతి ప్రతాపుడి గుర్రం దగ్గరికి నడిచి,

ఎంతో చనువున్న దానిలా అతడి అశ్వం మీద అధిరోహించి, రెండు చేతులతో ప్రతాపుడి భుజాల్ని పట్టుకున్నది.

ప్రతాపుడు ఆమె ప్రవర్తనకు విస్తుపోతూండగా కోయపెద్ద "దేవరా! మీ వెంట రావాలని మనసు పడినాదేమో? తీసికెళ్ళండి!" అన్నాడు.

ప్రతాపుడు "ఈ కన్యకెవరూ లేరా?" అని అడిగితే, కోయపెద్ద "ఎక్కడైనా వున్నారేమో తెలియదు. ఇక్కడ మాత్రం యెవరూ లేరు!" అన్నాడు.

ప్రతాపుడు ఆశ్చర్యయంతో, "ఇంకా వివరంగా చెప్పు," అన్నాడు.

కోయపెద్ద, "దేవరా! మల్లిగాడనే పేరుగల మావాడికి యీ పిల్ల ఏడాది పసివయస్సులో వుండగా ఏటిలో దొరికింది. దీన్ని వాడు పెంచి పెద్ద చేశాడు. యీ మధ్యనే వాడూ కాలమై పోయాడు. అప్పట్నుంచీ దిక్కులేనిదైంది. నువ్వు అమ్మోరివని అనుకున్న మేము బలియివ్వనుండగా, ఏందేందో జరిగి కథ యిట్టా అయ్యింది!" అన్నాడు.

ప్రతాపుడు కొద్దిక్షణాలు ఆలోచించి, 'సరే-యీ దిక్కులేని ఆడకూతురు నావెంట వస్తానని ఎందుకన్నదో ఏమో? యీయమె కోరిక మాత్రం యెందుకు కాదనాలి? వెంటతీసుకునే వెళతాను," అని చెప్పికోయల్నుంతా నమస్కరిస్తూండగా అక్కడినుంచి బయలుదేరాడు.

అప్పటికి సూర్యుడు తూర్పుకొండపై భాగాన కొద్దిదూరంలో ప్రకాశించ సాగాడు.



ప్రతాపుడు ఆ అడవి ప్రదేశంలో చాలాదూరం ప్రయాణించాడు. సూర్యుడు నడినెత్తిమీదకు వచ్చేసరికి అతడు అడవి దాటి, ఓ కొండప్రాంతానికి చేరాడు.

అప్పటిదాకా శబరకన్య అతడితో యేమీ మాట్లాడలేదు. ప్రతాపుడు కూడా ఆమెను పలకరించ కుండా, అలాగే ప్రయాణం కొనసాగిస్తూ వచ్చాడు.

కొండ ప్రక్కనవున్న బాట మీద గుర్రాన్ని మెల్లిగా నడిపిస్తూ, ఎరుడుదిగుడుగా వున్న ఆ ప్రదేశాన్ని పరిశీలనగా చూస్తూ ప్రయాణిస్తూండగా-హఠాత్తుగా అతడికి ఒక చోట ఓ నీడకనిపించింది.

అతిభయంకరమైన ఓ రాక్షసాకారం, యిద్దరు

మానవ యువకులు తన చేతి పట్టుల్లో గింజు కుంటూండగా యెక్కడికో తీసికెళుతూన్నట్లు ఆనీడలో తనకు స్ఫురించగానే, ప్రతాపుడు తలపైకెత్తాడు.

పైన మేఘ మండలాన్ని ఆనుకుని, ఓ రాక్షసుడు యిద్దరు మానవ యువకులను పట్టుకుని వెళుతూన్న దృశ్యం గోచరించగానే ప్రతాపుడు వెంటనే విల్లంబులు చేతుల్లోకి తీసుకున్నాడు.

క్రింద అశ్వంమీద ప్రయాణిస్తూనే, పైన వెళుతూన్న రాక్షసుడికేసి బాణం విడిచాడు. బాణం రివ్వున పైకి దూసుకు పోయి రాక్షసుడి కడుపులో గ్రుచ్చుకున్నది. పైనుంచి క్రిందికి వినిపించేట్టు ఆర్తనాదం చేస్తూనే రాక్షసుడు తనచేతుల్లోని మానవయువకులను విడిచిపెట్ట కుండా తన ప్రయాణాన్ని కొనసాగించాడు.

ప్రతాపుడు మరోబాణం ఎక్కుపెట్టాడు గాని, అప్పటికీ ఆ రాక్షసుడు మానవ యువకులతో బాటు అతడి దృష్టి పథం నుండి దూరమయ్యాడు.

మరికొద్దిసేపటికైనా, తన బాణంవల్ల ఆమానవయువకులకు వుపయోగం కలుగ వచ్చునని భావిస్తూ, ప్రతాపుడు తన పాటికి తాను ముందుకు సాగిపోయాడు.

అలాప్రయాణం కొనసాగిస్తూ అతడు మరికొంతసేపటికి, ఓ సెలయేటి దగ్గరికి చేరుకున్నాడు.

అక్కడ కాళ్ళూ చేతులూ కడుక్కుని, అశ్వానికి మంచినీరుత్రాగించి, కాసేపు బడలిక తీర్చుకున్న తర్వాత,తిరిగి ప్రయాణం కొనసాగించవచ్చునని భావించి, ప్రతాపుడు ఆసెలయేటి గట్టున గుర్రాన్ని నిలువరించాడు.

శబరకన్యకని క్రిందికి దించి, ప్రతాపుడు కూడా క్రిందికి దిగాడు. అతడు నీటిమట్టాన్ని సమీపించగానే, అంతవరకూ గులకరాళ్ళమీద స్వచ్ఛంగా పారుతున్న సెలయేటినుండి ఉవ్వెత్తునా అగ్నిజ్వాలలు యెగశాయ్!

—(ఇంకా ఉంది)



# స్వేచ్ఛ



విదర్భ దేశపు రాజు విష్ణు వర్ధనుడు గొప్ప పండితుడు. ఆస్థాన కవిగా ఎవరినైనా నియమించాలంటే సరైన వాడాయనకు లభించ లేదు. ఒక రోజు సాయంత్రం మారు వేషంలో నగర సంచారం చేస్తూ నదీ తీరాన్ని చేరుకున్నాడు విష్ణువర్ధనుడు. అక్కడ ప్రకృతి సౌందర్యాన్ని చూసి పరవశించి పోతూ ఆశువుగా కవిత్వం చెబుతున్న కవి ఒకడాయన కళ్ళ బడ్డాడు.

ఆ కవిత్వం అద్భుతంగా ఉండటంతో విష్ణు వర్ధనుడు కవిని సమీపించి తన్ను తాను పరిచ యంచేసుకుని,": నిన్ను నేను నా ఆస్థాన కవిగా నియమిస్తున్నాను," అన్నాడు.

కవి వెంటనే, "ప్రభూ! స్వేచ్ఛలోనే కళలు వికసిస్తాయి. నేను మీ ఆస్థాన కవి పదవిని స్వీకరించలేదు. మన్నించండి," అన్నాడు.

రాజు కోపంగా, "నా ఆస్థాన కవికి స్వేచ్ఛ లేదని ఎవరన్నారు?" అన్నాడు.

"అయితే సమస్య ఏముందీ? నేను మీ ఆస్థాన కవినే! స్వేచ్ఛగా ఇలా బయట తిరుగు తూనే కవిత్వం చెప్పుకుంటాను. మీ ఆస్థానానికే వచ్చి కవిత్వం చెప్పాలన్న ఆంక్ష విధించి నా స్వేచ్ఛకు భంగం కలిగించకండి," అన్నాడు కవి.

'స్వేచ్ఛ అంటే కవి భావమేమిటో అర్థమైన విష్ణు వర్ధనుడు సిగ్గు పడి మారు మాట్లాడ లేదు.

—యం. కృష్ణ.


స్వచ్ఛంద సేవ
స్వచ్ఛంద సేవాసమితిలో కొత్తగా చేరిన వారందరికీ, "సామాన్యులకు ప్రతిఫలాపేక్ష లేకుండా అడగకుండా సహాయపడటమే స్వచ్ఛందసేవ," అని చెప్పాడు ఆచార్యుడు.
మరునాడు సమితికి పది మంది సభ్యులు ఆలస్యంగా వచ్చారని ఆచార్యుడు మండి పడితే, "ఒక ముసలమ్మ చెట్టు కింద కూర్చుని ఉంది. బాట మీద ఎడ్ల బళ్ళు గుర్రబ్బళ్ళు ఆగకుండా వెడుతున్నాయి. ఆమెను బాట దాటించటంలో ఆలస్యమైంది. మన్నించండి," అన్నారు వాళ్ళు వినయంగా.
ఆచార్యుడు మెత్తబడి, "మంచి పనే చేశారు. కానీ, ఒక ముసలి దాన్ని బాట దాటించటానికి పది మంది కావాలా? ఒక్కరు చాలరా?" అన్నాడు అనునయంగా.
"ఏంచేసేది ఆచార్యవర్యా! ఆ చెట్టు కింద నుంచి లేవడం ఆ ముసలమ్మ కిష్టం లేదు మరి!" అన్నాడు పదిమందిలో ఒకడు.
ఆచార్యుడు ప్రాన్పడి పోయాడు.
—డా॥ తాటిచెర్ల గురు రామ ప్రసాద్



# ఉసురు

మాధవయ్య భార్య అకస్మాత్తుగా జబ్బుచేసి చనిపోయింది. ఆయన కిద్దరు పిల్లలు. వాళ్ళ ఆలనాపాలనా చూసుకుంటుందని ఆయన వనజను రెండోపెళ్ళి చేసుకున్నాడు. మొదట్లో వనజ పిల్లలిద్దర్నీ ఎంతోబాగా చూసుకునేది. అందుకు మాధవయ్య ఎంతో సంతోషించాడు.

వనజ గర్భవతి అయింది. అప్పటినుంచీ ఆమె మనసు మారిపోయింది. మొదటి భార్య పిల్ల లిద్దరూ తన బిడ్డతోపాటు భర్త ఆస్తిలో వాటాపంచుకుంటారని ఆమెకు భయం పట్టుకుంది. దాంతో రోజూ ఆపిల్లలిద్దరికీ కష్టమైన పనులు చెప్పి వేధిస్తూండేది.

ఇది గమనించిన మాధవయ్య భార్యను పిలిచి, "నేను నాపిల్లల్ని బాగా చూస్తావనే నిన్ను పెళ్ళిచేసుకున్నాను. నువ్వు వాళ్ళనిలా వేదించకు" అని చెప్పాడు.

"పిల్లల్ని చూడ్డం కోసమే అయితే పెళ్ళెందుకు చేసుకున్నారు? ఏ దాసీదాన్నో కుదుర్చుకోవలసింది" అని ఈసడించింది వనజ.

"అయితే పిల్లల్ని హింసించటం మానవా?" అన్నాడు మాధవయ్య కోపంగా.

"నేను వాళ్ళను హింసించటం లేదు. వాళ్ళకు బొత్తిగా ఒక్కపనీ రాదని అన్నిపనులూ నేర్పుతూంటే మీరేమో హింసిస్తున్నానను కుంటున్నారు. కన్నతల్లి అయితే, ఏంచేసినా ఫరవా లేదు. సవతితల్లి క్రమశిక్షణ నేర్పినా హింసలాగే ఉంటుంది" అని కళ్ళనీళ్ళు పెట్టుకుంది వనజ.

మాధవయ్య ఆమెను దగ్గరగా తీసుకుని, "ఏడవకు నువ్వు. పిల్లల్నీ బాగా చూచుకునే మాటయితే నాకూసంతోషమే! కానీ నీబాధ్యత మరచి,చిన్న పిల్లల్ని హింసించావా? వాళ్ళ ఉసురునీ బిడ్డని కొడుతుంది. అందుకే హెచ్చరిస్తున్నాను. నువ్వేం చేసినా బాగా ఆలోచించి చేయ్." అన్నాడు.

వనజ సరేనంది కానీ ఆమె ప్రవర్తనలో మార్పులేదు. వనజకు నెలలు నిండగానే

ఆరువల్లి గోవిందరాజులు



పుట్టింటి వారొచ్చి పురిటికి తీసుకుని వెళ్ళారు. అక్కడ ఆమెకు పండంటి బాబు పుట్టాడు.

మాధవయ్య ఒక్కడూ కొడుకును చూడ్డానికి వెడితే, "చూశారా? బాబెంత చక్కగా ఉన్నాడో! అంటే మీ పిల్లల విషయంలో నేను సరిగ్గా ప్రవర్తించాననే కదా అర్థం!" అంది వనజ సంతోషంగా.

"అంతా నీ మనస్సాక్షికి తెలును" అని వెళ్ళిపోయాడు మాధవయ్య.

బాబుకు మూడో నెలరాగానే అత్తారింటికి బయలుదేరాడు. దారిలో ఎడ్లబండి తిరగబడింది. అందరికీ పెద్దగాయాలయ్యాయి. దగ్గర్లో ఉన్న సన్యాసి ఒకడు తన శిష్యుల సహాయంతో వారిని తన ఆశ్రమానికి తీసుకుని వెళ్ళి తగిన శుశ్రూషచేశాడు. పెద్దవాళ్ళంతా రక్షించబడ్డారు కానీ దెబ్బలు గట్టిగా తగలడంవల్ల బాబుమాత్రం చనిపోయాడు.

వనజ కన్నీరు మున్నీరుగా ఏడుస్తూంటే, సన్యాసి ఆమెను ఓదార్చి, "అమ్మా! నీభర్త మొదటి భార్య బిడ్డల ఉసురు నీ బిడ్డకు కొట్టింది. ఇదినీకు తగిన ప్రాయశ్చిత్తం. ఇకనైనా బుద్ధితెచ్చుకుని, ఆపిల్లల్ని కన్నబిడ్డల్లా చూచుకో! ముమ్ముందిలాంటి ప్రమాదాలు జరుగవు," అనిచెప్పాడు.

ఈ మాటలకు వనజ క్రోధం వచ్చి, "వాళ్ళకు నేనేంలోటుచేశాను? రోజూ వండిపెడుతున్నాను. పనులు నేర్పుతున్నాను. ఈఉపకారానికి ప్రతిఫలంగా వాళ్ళు నాబిడ్డను ఉసురుపెడతారా?" అంది.

సన్యాసి నవ్వి, "వాళ్ళు నీ బిడ్డకు ఉసురు పెట్టలేదు. వాళ్ళు మంచివాళ్ళు నువ్వు వాళ్ళకు పెట్టిన బాధలు ఉసురుగా మారి నీబిడ్డను కొట్టాయి తప్ప, వాళ్ళేం నీబిడ్డకు అపకారం తలపెట్టలేదు. అందువల్ల, నీ ఉసురు వాళ్ళకి తగలదు," అన్నాడు.

"వాళ్ళసంగతి మీకు తెలియదు. తిరిగివెళ్ళగానే వాళ్ళమీద పగతీర్చుకుంటాను," అంది వనజ.

"వాళ్ళు చెడ్డవాళ్ళే అయితే నేనూ నీకు సహాయపడతాను. ఇదిగో ఈ మూలిక తీసుకో!

నీసవతి బిడ్డలు చెడ్డవాళ్ళని ఋజువైతే నాపేరు తల్చుకుని వాళ్ళిద్దరికీ ఈమూలికను తగిలించు. ఇద్దరూ వికలాంగులైపోతారు. అన్యాయంగా వాళ్ళకి మూలికను తగిలించావంటేమాత్రం వాళ్ళకేమీ కాదుగానీ, ముమ్ముందు నీకు పుట్టబో యేబిడ్డలు వికలాంగులవుతారు," అన్నాడు సన్యాసి.

కాస్తకోలుకున్నాక ఆశ్రమమునుంచి మళ్ళీ బయలుదేరి యిల్లు చేరుకుంది వనజ. అప్పు డింట్లో మాధవయ్య లేడు. బండిచప్పుడువిని ఇంట్లోంచి పిల్లలిద్దరూ పరుగున వచ్చారు.

బండిలోంచి దిగిన వనజను చూచి," వచ్చే వా, పిన్నీ! మీకోసమే ఎదురు చూస్తున్నాం!" అన్నారు వాళ్ళిద్దరూ.

"వాడితో మీకేంపని?" అంది వనజ ఉక్రో షంగా.

"నేనేమో బాబుపడుకునేందుకు మెత్తటి దూదితో చిన్నపరుపుకుట్టాను. తమ్ముడేమో నెల్లా ళ్ళనుంచీ కష్టపడి బాబుకోసం చిన్నమంచం తయారుచేశాడు. వాటితో ఇకమాకేంపని? మాకేంపనిలేదు," అంది పెద్దపిల్ల.

వనజ వాళ్ళనిద్దర్నీ దగ్గరగా తీసుకొని,"మీరు చాలా మంచివాళ్ళు మిమ్ముల్ని బాధపెట్టటం వల్లనే ఉసురుకొట్టి నాబిడ్డ నాకు దక్కలేదు," అనుభోరున ఏడ్చింది.

పిల్లలిద్దరికీ ఆమె ఏమంటోందో తెలియదు. కానీ బాబులేదని వాళ్ళూ ఏడ్చారు.

ఆతర్వాత నుంచీ వనజ పిల్లల్నేకాదు, అకా రణంగా ఏవర్నీ హింసించలేదు. అందువల్లనే ఏమో తర్వాత ఆమెకు పుట్టిన ఓ కూతురు, కొడుకు ఎంచచక్కా పెరిగి పెద్దవారయ్యారు. చూచినవారు వనజకు నలుగురు పిల్లలనేవారు తప్ప వారిలో మొదటి యిద్దరికీ ఆమెసవతితల్లి అని గ్రహించేలేకపోయారు.



# అక్కరకు రాని విద్యలు

పూర్వం దండకారణ్యంలో నివశించే నక్క ఒకటి. ఒకరోజున తన కంట పడిన పిల్లిని చూచి జాలిపడుతూ, "నాకు తెలిసిన ఎత్తులు, జిత్తులు మరెవ్వరికీ తెలియవు. ఏ విద్యలూ తెలియని నీవీ అడవిలో ఎలా బ్రతుకుతావోనని జాలిగా ఉంది," అంది.

ఆ మాటలకు బదులివ్వ కుండా పిల్లి నవ్వి ఊరుకుంది.

ఇంతలో దూరాన్నించి సింహం గాండ్రింపు వింటూనే, నక్క "అది ఆకలి గొన్న సింహం. దాని వేగాన్ని తప్పించుకుని పారిపోవటం కష్టం. ఇప్పుడేం చేయాలి?" అంది.

బదులుగా పిల్లి, "నీకు తెలిసిన ఎత్తులు, జిత్తులు నాకు తెలియవు. కానీ యిలాంటి ప్రమాద సమయంలో చెట్టెక్కి, నేను రక్షించుకో గలను," అంటూ దగ్గర్లో ఉన్న చెట్టెక్కి కూర్చుంది.

ఆ విద్య రాని నక్క పరుగులంకించు కుంది కానీ సింహం బారినుండి తప్పించుకోలేక ప్రాణాలు కోల్పోయింది.

పిల్లి నిట్టూర్పుతూ, "అన్ని విద్యలూ అక్కరకు రావు," అనుకుంది.

—ఆర్.వి. రాఘవరావు





## మనవడి ప్రశ్న

1. ఎర్రమాను చెట్లను ఎప్పుడు కొట్టి వేయాలి? ఎందువల్ల?

2. రాత్రిపూట కొన్ని గడియారాలు వేగంగా తిరుగుతాయి. ఎందుకని?

3. వెనుక వైపుకు ఎగుర గల పక్షి ఏదైనా వుందా? దాని పేరేమిటి?

4. మనుషులలాగే జంతువులకు కూడా పంటి నొప్పి వస్తుందంటారు. ఇది ఎంత వరకు నిజం?



## తాతయ్య జవాబు

1. రాత్రిపూట అది మెత్తగా పీచులేకుండా వుండి ఎక్కువ ఎరుపు రంగును కలిగి వుంటుంది.

2. ఉష్ణోగ్రత తక్కువగా వుండటం వల్ల, అవి వేగాన్ని పుంజు కుంటాయి.

3. హమ్మింగ్ పక్షి. ఇది రెక్కల్ని ముందుకు వంచి పూపుతూ వెనుక్కు ఎగురగలదు.

4. అప్పుడప్పుడూ వస్తుంది.

Edited and published by Vijaya Bapineedu, 80, Dhanalakshmi Colony, Madras-26. Phone : 422233 and Printed by N. Navin Chandran, at S.R.Offset Art Printers, Madras-21, Phone : 552462

# "వ్యవసాయమే నా వృత్తి"



ఆనందంతో ఉన్న గంగారాంకు తన వృత్తి పట్ల గౌరవభావముంది.

దేశాన్ని పోషించే వృత్తి.

అతనికి మంచి ఆదాయాన్ని సమకూర్చే వృత్తి. వ్యవసాయం స్తంభించే పని అనీ నష్టం వచ్చే వ్యాపకమన్న రోజులు పోయాయి.

స్వతంత్ర భారత దేశం కర్షకులకు ప్రతిఫలం ముట్టే హామీ ఇచ్చింది. మెరుగైన విత్తనాలు మెరుగైన సేద్యపు నీరు, విద్యుత్ సౌకర్యాలు, ఎరువులు, క్రిమి సంహారక మందులు, అవన్నీ సబ్సిడీ రేట్లకు లభిస్తున్నాయి.

అవసరమైనప్పుడు ఋణం, మంచి ధర- ఇవన్నీ తమ పాత్రను నిర్వహించాయి. కర్షకులు ఈ సౌకర్యాలను పూర్తిగా ఉపయోగించుకున్నాడు.

కష్టించి పని చేయడం, సాంకేతిక పరిజ్ఞానం- ఇవి హరిత విప్లవానికి దారితీసాయి.

ప్రస్తుతం భారత దేశపు ఆహార ఉత్పత్తి 17 కోట్ల టన్నుల మేర జరుగుతోంది- 1947లో జరిగిన ఉత్పత్తికంటే 12 కోట్ల టన్నులు ఎక్కువ.

## మన పురోగతి మనకు గర్వకారణం

davp 89/278 Tel.